శ్రీ

# కాళిందీ పరిణయము

ఇది

భూలిపాళ వెంకట్రామయ్యగారిచే

రచియింపఁబడి,

శ్రీ బండారు నాగభూషణరావు నాయుడుగారి

కంకిత మీయఁబడినది.

ఈ కృతిపతిగారి సోదరు లగు

సత్యానందము నాయుడు గారిచే

ముద్రింపించి ప్రచురింపఁబడియె.

మంజువాణీముద్రాక్షరశాల,

ఏలూరు.

1907.

# కాళిందీపరిణయము.

## ప్రథమాశ్వాసము.

---

శా. శ్రీగాంధర్వ సుధాంశుచే శ్రుతి చకోరీ యుగ్మ సంతుష్టిదా
వేగ న్నైజయుగం గాంతుచే వ్రజవధూ బృందంబు గోగోపకుల్
రాగశ్రీ వారల నేలుచుండు ఘన లీలాకృష్ణుం దక్షిణ స
త్ప్రాగల్భ్యంబున నాగభూషణుఁ గృపన్ రక్షించు నశ్రాంతమున్.

సీ. ఏవామ భూకాంతు దేవియై వెలిఁగించు
నీలాంబు జన్మ సన్నేత్ర గరిమ
నే తలోదరి కంతు మాతయై వెలిఁగించు
పాణి గృహీతాబ్జ వార గరిమ
నే తన్వి దుగ్ధాబ్ధి సూతియై వెలిఁగించు
లలిత వళీభంగ ముల బెడంగున
నే బాల చంద్రుని తోఁబుట్టువుగ బొల్చు
సరసానన సువిలాసంపు గరిమ

గీ. నట్టి [illegible]ముల [illegible]వరాలు దిట్టతనము
మీర బండారి తలదుగ్ధ నీరనిధి హి
మాంశుఁ డైనట్టి నాగభూపాగ్రు నింట
నిండు వేడుకఁ గాపుర ముండు గాత. 2

చ. అలికుల వేణి సోమసగ మారయగా నెలవంక తెంతయున్
బొలిచె దళంబుగా సనిసి బొల్పు వహింపఁగ నవ్వి జారు పై

టి లలన నేర్పుతోడను దిటంబుగఁ జేయఁగ సంతసించి కౌఁ
గిలిగొను నట్టి శంకరుఁడు కిల్బిషుఁ జేయుత నాగభూషణున్. 3

ఉ. ఆరయ మస్తకాగ్ర నిహితాబ్జము వాఁడు నటించునల్ల భా
గీరథి నెత్తి బెట్టితివి కేటిచు నెంతటి జాణవిట్టి నీ
నేరుపు నాత్మ మెచ్చదగు నిచ్చలటంచు గిరీశుఁజూచి పల్
గేరడమాడు గౌరి శుభ కృష్ణుని జేయుత నాగభూషణున్. 4

ఉ. వాయుహతిం బ్రబలిధ్వనులు వచ్చుదరీ నికురుంబసంగ గాం
గేయ ధరాధరంబు గతిగేరుచు జూడ ననంతవకా సదా
మ్నాయము లుచ్చరించ వదనమ్ముల వాక్సతి బూనిపద్మ పీ
ఠాయతిగూడు ధాత విభవాగ్రుని జేయుత నాగభూషణున్. 5

ఉ. దోర్బలహారి మృణాళముల నూనత మెచ్చ తురంగమంబులం
బీలుస దృక్కరిరమున వేదపువీధి ననారతంబు వా
హ్యాళి యొనర్చు నేమసుక రాలకయా తెలి దన్మిచూలి ప్రో
యాలు ప్రవీణ మామక మహాకృతి నాథు గృతార్థు జేయుతన్. 6

మ. హరమూర్ధాగ్ర నటద్ధునీఝరిని హస్తాగ్రంబు లం బీల్చి సా
దరతం దల్లికిఁ బుష్కరంబయిన మోదంబిచ్చి యత్యర్థనూ
సురుచిం బాల్య విచేష్టలెల్లఁ గడు దాఁజూపించి శాతాహః
స్ఫురణం దండ్రికొసంగి ముద్దుగొను దేవుంగొల్తు దృష్టసిద్ధికిన్. 7

సీ. ఏమహాబలవంతు డెనలేని జవమునఁ
గడలేక యొప్పెడి కడలిదాటె
నేతపోవంతుండు బ్రీతిఫలంబంచు
శైశవంబున సారస హితుఁ బట్టె

నేసుగుణా ప్రాకుఁ డిలబాహు ముఖలాన
నక్షసజము ప్రోలి కంపెఁజూడ
నేదయామానసుం డిం ద్రాక్షిసులవన
ముల కగ్ని హోత్రంపు కలనుజూపె

గీ. నలర రామాను జన్మ జీవాత్మ నిచ్చి
నట్టి పర్యాయ ధాత మహా బలాత్మ
జుండు ఘనకృపాకలిత చిత్తుండు గాథ
కరుణ మమ్ముల నిచ్చలు గాఁచుగాత. 8

ఉ. ఏకవి జిహ్వఁ బొల్త గననింపు వలిర్పఁగఁ బాదనూపురా
స్తోక ఘుణంఘుణ ధ్వనులు శోభిల భారతి నాట్యమాడె నే
ఛేకుని చిత్తపద్మమునఁ జేరెను దారక హంసమట్టి స
న్నాకవి సుతున్న దీయకృతి నమ్మికబూర్ణము జెందఁగొల్చెదన్. 9

మ. చిరభక్తి న్ననుపాశ్రయింతును మహా శృంగార వాగ్ధోరణా
కరు ద్వైపాయను గాళిదాసు సుకవి గంభీర వాగ్ధారు ధీ
వరు జోరు న్నివభ్రను మాఘు జయదేవజ్ఞు న్మయూరాహ్వయున్
నరసాగ్రేసరు భారవిం దలఁతువాక్సారస్య సంసిద్ధికిన్. 10

గీ. నమ్ముఁబాఁచ్చవభౌతికపు తనువని యుం
వాఙ్మయాక్షర గాత్రంబు వరలఁబూని
వైకృతోక్తి విశుద్ధిని వశముపడఁగఁ
దెలియఁ జెప్పెడి నన్నయ నలువకేను 11

గీ. కావ్య నాటక జాలముల్ క్షమనచించి
యాధునిక కాళిదాసన నలరు చుండి

నీతు లను బెక్కు గఱపుచు నెగడునట్టి
కందుకూరి వీరేశలింగమునుతింతు. 12

క. తలఁతుం దిక్కన నెఱ్ఱన
విలసద్వచన ప్రకాశుఁ బెద్దన ముద్దుం
బలుకులుగల తిమ్మన నే
విలసద్వాక్యములు గలుగఁ బృథ్వి నిరతమున్. 13

క. నన్నయ గుర్వవతంసునిఁ
బన్నుగ వడ్డాది వంశ వార్ధి శశియు ధీ
మన్నయుఁ డగు సుబ్బారా
యున్నెరయఁగ దొడ్డయార్యు నోజం దలఁతున్, 14

క. తప్పు కవిత్వముఁ జెప్పిన
యొప్పుగ నాసుకవిదిద్దు నొప్పుల నెపుడున్
దప్పు లనుచుండు కుకవుల
నెప్పుడు నిందింతువారి నిజ్జగమందున్. 15

సీ. కావ్యంబులను జూచి గాథంబులౌ ప్రబం
ధముల సహాయత నవ్యముగను
భాగవతంబులోఁ బరగు "కాళిందీప
రిణయంబు" నెడి కథ ననుసరించి
నాగభూషణు ప్రేరణంబునఁ గావ్యంబు
గా నొనర్పంబూని నానుగాన
మధువడౌ పోయంగ మసకలు గనుపించుఁ
గావున దీనిలోఁ గలుగుతప్పు

గీ. లాత్మజాల ముద్దు వాక్కుల నగసి తండ్రి
గారవించెడి రీతిమా కావ్యమును తు
మించఁగోరుదు నెప్పుడు మేలిమిగను
సుకవి వరులార నిర్మల సుజనులార. 16

వ. అని యివ్విధంబున నిష్టదేవతా ప్రార్థనంబును పురాతనాధు నాతనకవిశ్రేష్ఠ వందనంబును గుకవి నిరాకరణంబును గావించి శృంగార రసబంధురంబగు నొక్క ప్రబంధంబు రచించ నారంభించు నవసరంబున. 17

సీ. బండారి కులదుగ్ధ వారాశి జనియించి
పంక జాళులయందుఁ బగవహించి
బహు కలాస్థాన ప్రభవహించి యనుదార
జైవాతృకత్వప్ర శస్తిఁగాంచి
యాశ్రితకువల యాహ్లాదంబొసఁగిజన
నేత్రంబులకు మోద నియతిఁగాంచి
ఘనపథసంచార ఘనత వహించియు
నరిపుల గర్వంబు నపహరించి

గీ. విబుధగణముల్ప పాలిటివిభవరణముసఁ
జెలగుచుండెడి సర్వస్వములను గాంచి
నాగభూషణ ఘనకుండు భోగినాథ
భూషణోజ్జ్వల మూర్ధాగ్ర భూషణుండు. 18

వ. వెండియు నఖండ మార్తాండ మండలానుహార పిచండీల కాంతిమండల సదనుండును, వివిధాశావపూరితే శాన శేఖరద్యుతి నితాంతా

సుకార సుశ్లోక భృశుండును నిర్మలశర్మనిర్మిత చిత్రఫలకాన్వితభిత్తి కాంత సహితాస్థానుండును విశ్వవిశ్వంభరా వినుత ప్రభువైశ్వర్యధురీణుండును సకలశుభలక్షణసంకీర్ణఘోటక హాటకాదివివిధగణపరిసేవితుండును వివిధారాతి నికురుంబాంకుశాయత ఘటోద్భవుండును నానావిషయ వాణిజ్యప్రకటన లక్ష్మీనిధవాతిశయుండును నిశ్శేషకృచిత్త సుహృచ్చక్రవాళక చకోరక క్షపాకరుండును శ్రీరామచంద్ర చరణారవింద మదవదిందిందిర స్వాంతుండును అద్విజిహ్వాసంచారాద్వైత లబ్ధచిత్తానాయాస కరంబులు న్యాయాలోచన కవిశ్రేష్ఠ చర్చాపరపోషణ దిష్టంబులయంచుఁ బలవాఁడును వితరణాగుణాబ్ధి లాభుండును వినుతసుగుణసూర్యుండును విద్వన్మనోహరుండును పమిడిపాలగోత్ర పవిత్రుండును నగు నాగభూషణుండను నిస్తంద్ర విభవ సాంద్రుండై యొక్కనాఁడు రత్నకీలిత ద్వారబంధబంధుర లక్ష్మీవిలాస భాసమానంబైన మందిరంబున. 19

సీ. సకలవిషయవణిజ్జనసంఘములు జూడ
నొప్పుగ నొకచక్కి నల్లసిల్ల
నిఖిలాత్మ వాణిజ్య నికరసంబంధమౌ
లేఖకులు నితాంత లీలమెఱయ
వివిధవిజ్ఞానంబు వెలయ బోధించెడి
ధీవయస్యులు ప్రక్కఁ దేజరిల్ల
రహిఁబుట్టువల్లకీ రవముచేరాల్లర
గించు వైణికులు నటించుచుండఁ

గీ. బండితస్తోమ మెల్లను బలసికొల్వ
వరవణిగ్వ్రాత మంచెచి వస్తువులను

బట్టి కట్టెదురకు దెచ్చి భటులు జూప
విమల మగుశివిం జేరోలగమున నుండి. 20

మ. నను శ్రీరామ పదాంబుజాత భజనానందు న్మహోవాయునం
దనదాక్షిణ్య సులబ్ధనిత్య కవితాధారున్ లసద్గాధినం
దనగోత్రోద్భవ ధూళిపాళికులజున్ రంజిల్లగా గౌరవం
బనుకంపంబొలువంగఁ బంచి యనియెన్ హర్షప్రచిత్తంబునన్. 21

గీ. సుతతటాకాది సప్తసంతతులు వెలయు
నందుఁ గావ్యమఖిలముగాఁ గనయశస్త
మయ్యు నొప్పెడి నద్ది కావ్యంబు గాన
దానినే మాకు సమకూర్చు తడయ కిపుడు. 22

వ. అని సబహుమానంబుగ నానతీయఁ బల్లవిత సల్లలిత స్వాంతుండనై
వల్లెయని నేనును ప్రబంధరచన కారంభించి కృతినాయకుని వంశా
వతారం బభివర్ణించెద. 23

## కృతినాయకుని వంశము.

సీ. నతచతుర్భుజ నాభి నవపంకజ మతల్లి
కడుపార నెవ్వానిఁ గన్నతల్లి
సకల కళాకన్య కకళంక సుందర
మెవ్వాని నిటలమై నివ్వటిల్లుఁ
బాఱిఁ జదువుల కాల వాలమై యెవ్వాని
మోము ప్రకాశించు మోదమలరఁ
బోరోగిగము లిండి పాతున కెవ్వాఁడు
జనకుఁడన్ బేరుచే వినుతిఁ గాంచు

గీ. నతఁడు వొగడొందు హంసవాహనుఁడనంగ
నలుమొగంబుల వేల్పన నలువ యనఁగఁ
దమ్మిగద్దియఁగొలువుండు తగవరియన
మించి జగము బుట్టించి విరించియలరు. 24

గీ. కమలజా పదంబు లందుఁ బెక్కండ్రు బుట్టి
భూరి విఖ్యాతిగాంచి కంసారి చరణ
పద్మ మనుకర చిత్తులై పరచి రందు
నిందుగను నరసింగ రాయండు పుట్టె. 25

సీ. తనశస్త్ర ధామంబు తనశస్త్రధామంబు
కరణి మిత్రోల్లాస కరముగాఁగఁ
దనదు ప్రసిద్ధంబు తనదు ప్రసిద్ధంబు
పగిది చంద్రాలోక భాతిగాఁగఁ
దనభూరి సుగుణంబుఁ దనభూరిసుగుణము
ట్లాకులిత శ్రుతిమార్గ గతముగాఁగఁ
దన యంబకంబులు తనయంబకము లట్లు
పరభీతి విముఖంబు వరలు చుండ

గీ. జగతి నితఁడనఁ గీర్తి విస్తారములను
బొంది దుర్భిక్ష కాలంబు నందు జనులఁ
దుష్టులను జేసి వితరణ నిష్ఠఁ బొడ
రమ్య గుణహారి నరసింగ రాయ శౌరి 26

క. ఆతనికి సుగుణగణ వి
ఖ్యాతుం డగుపిన్న వేంకటాద్రిజనించెన్

పీత్వాఖిల ఖలుఁడుపయ
స్రోతస్విని ధవు నిఘుండు సోమునిభంగిన్. 27

సీ. సంక్రంద నాత్మజ సంక్రందనాత్మజ
సమసౌఖ్య రూప శౌర్యముల వాఁడు
మాతరిశ్వ కుమార మాతరిశ్వ కుమార
సమజవ శక్తి సత్త్వముల వాఁడు
ఖండ పరశుమిత్ర ఖండ పరశుమిత్ర
నిభ విభూతిప్రభా నిధుల వాఁడు
కాశ్య పీధరరాజ కాశ్య పీధరరాజ
సమవాక్య వక్త్ర ధైర్యముల వాఁడు

గీ. జగతి నితఁడనఁ బరగు విస్తారకీర్తి
పూరితాంభోజ జాండ సంపూర్ణ గరిమ
భూష ణోజ్జ్వల ఘనకుండు భోగనిధియు
వితరణ గుణాభి లాషుండు వేంకటాద్రి. 28

వ. వెండియు

గీ. మహిని యాచక పరభృత మధు దివసము
హిత వితానచకోరక హృద్య చంద్రుఁ
డరయఁ గరుణారసాంబుధి యనుచు ఖ్యాతి
వెలయఁ గాంచెను ఘనముగ వేంకటాద్రి. 29

సీ. హిమధరా ధరపుత్త్రి యేటిసా ధ్వమగనిఁ
గయ్యంబు వెట్టి సగంబు జేసె
నీరజాలయయేటి నిశ్చలు రాలయ్యెఁ
దన ఘనోరంబు పాదమునఁ ద్రొక్కె

వసుమతీ సతిమేను యశాంసులవెల్లద్రొక్కి
తన శౌరిషున వసమునసెఱుంచె
బాన్త్రిప్రియే సుచరిత్ర పతితృప్తి చాలక
పరుల బోఁదెనుతాను భయముఁదక్కి

గీ. యనుచు మాతంగ పుత్త్రిక వనజవాస
గాశ్యపీ కాంత బరవేష్టి కాంతెను నిర
సించి వేంకటాద్రి వసుప్రమింబు జలసు
శీల కుశల నిర్మల భాతిఁజేసి పతికి. 30

చ. మనసిజ తుల్యమూర్తి నవమంజు గుణోజ్జ్వల కీర్తి వేంకటా
ద్రి నిజసతీలలామ భరదివ్య విరాజిత శీలయందు న
త్యనఘగుణాళి భూషణుఁ డహస్కరపాద పయోజ భృంగ హృ
ద్వినుతుఁడు సత్యయాఖ్యఁగనె దేవతరు న్ననుసింధుకైవడిన్. 31

సీ. తన ఘనత్వముఁ జూప నను ప్రేప్పనాగభూ
షణునకున్ శీర్ష భూషణముగాఁగఁ
దన వాత్స్యల్యత్వంబు నను వొందఁ ధరణిమం
డనునకు శీర్ష మండనముగాఁగఁ
దనదు దక్షుకవర్ధనము వీరభద్రుని
మూర్ధంబు భూషణ ముగ నొసర్చఁ
దనశివ ధామంబు తద్దయు నిచ్చలు
నరయు మిత్రో న్నేష కరముగాఁగఁ

గీ. ధరణి నెంతయుఁ గీర్తి విస్తారములను
వెలయఁ దొరయుచు భక్తిని విబుధ వరులఁ

పూజ సేయుము విభవంబుఁ బొందుమండె
సకల గుణహారి బండారి సత్యశౌరి. 32

వ. వెండియు సత్యయాహ్వయుండు.

మ. సరసోద్దీప్త నఖప్రసూన యుతదోశ్శాఖల్ దగం జెంది వి
స్తరకీర్తిస్ఫుట వాసనల్ గలిగి సత్సారస్య వాఙ్మాకరం
దరసంబుం జెలువొంది భావుకోమలన్ రంజిల్లిధీమంతులన్
వరకీరంబులఁకున్ ఫలంబొసగు గీర్వాణావనీజంబుగన్. 33

సీ. మిత్ర పద్మములం దమిత్ర పద్మములం దఁ
గాంచన నికరమే ఘనుఁడు నిలిపె
మూర్తి యందు న భీమ మూర్తి యందును మహా
విషమాంబకత్వమే విభుఁడు దాల్చె
ధామంబు నందు సద్ధామంబు నందును
మిత్రాళిలి నే సుచారిత్రుఁడుంచె
ధర్మంబునందు సద్ధర్మంబు నందును
ధరగుణం బేధవ్య తరుఁడొనర్చె

గీ. వాతడాశ్రిత కువలయాహ్లాద కరుఁడు
రాజ నఁగ నొప్పు ననుచు ధరాజనములు
వలికి కీర్తించఁ దనగీర్తి ధరము దొరసె
సకల గుణహారి బండారి సత్యశౌరి 34

సీ. లేడి పొంచినవాని లేడినుంచినవాని
లేడిఁ బెంచినవాని నీడువచ్చు
ఫణిని మట్టినవాని ఫణినిఁ జుట్టినవాని
ఫణినిఁ బట్టినవానిఁ బరిహసించు

శిఖరిఁ జెక్కినవాని శిఖరినొక్కినవాని
శిఖరి గ్రుక్కినవానిఁ జిన్నబుచ్చఁ
దమ్మిఁదాల్చినవానిఁ దమ్మిఁజీల్చినవానిఁ
దమ్మిమొల్చినవానిఁ దగజయించు

గీ. ధరణి సత్యకలాశక్తి భరణ భూతి
జవసు భోగ ప్రభావ ధీరవరురువిర
బాహు బలబుద్ధులందు సమాన మగునె
యితరు లీసత్య శౌరికి సతత మరయ. 85

సీ. హరివైరి హరివైరి హరివైరి సదృశుండు
బలశౌర్య భూరి జవంబులందు
హరిమిత్ర హరిమిత్ర హరిమిత్ర సదృశుండు
భూతి కలాధిక్య నీతులందు
హరిపుత్త్రి హరిపుత్త్రి హరిపుత్త్రిసదృశుండు
వీర్య రూపాధిక్య వితరణముల
హరిపౌత్ర హరిపౌత్ర హరిపౌత్ర సదృశుండు
శౌర్య ప్రభావ సద్ధర్మ విధుల

గీ. నంచు లోకంబు లెల్లఁ గీర్తించు చుండ
సుగుణ గణములచేతను సొంపు మీఱ
నాశ్రితుల నెల్ల రక్షించు ననెడికీర్తి
యతిశయంబుగ దొరకె సత్యాహ్వయుండు 86

క. వితరణఖనియును సత్య
వ్రతు సత్యాఖ్యునకు గోత్ర వైరికిని జయం

త తనయుగతి నార్యులయెడ
నతగుణుఁడై నట్టి స్వామి నాయఁడు పుట్టెన్. 37

సీ. ఏజవశుచికీర్తి రాజత్వము వహించుఁ
గువలయా నందంబుఁగూర్చి యెపుడు
నేభవ్య సంశీలుఁ డింద్రత్వము వహించు
విబుధ సంపర్కంపు పెంపుగలిగి
యేవితరణఖని యిలహరిత్వముఁ బూను
దస్యుద్విరదక వర్ధన మొసంగి
యేగుణ వార్ధితుండు భోగ పతిత్వంబుఁ
బూనునాశ్రితభర మునువహించి

గీ. యతఁడు చెలఁగను విస్తార మైనకీర్తి
సరస బండారి కులదుగ్ధ జలధిచంద్రుఁ
డంచుఁగాశ్యపి జనులు నుతించు చుండ
నయగుణవిహారియా స్వామి నాయఁడరయ. 38

చ. సకల గుణాలవాలుఁడయి సన్నుతి కెక్కుచు సారదానశ
త్రుకలుష పట్టణావళి నిరోధనుఁడై పరిపాలితార్యుఁడై
వికసితకీర్తి నిత్యుఁడయి పృథ్వి జనించెను స్వామినాయఁడా
మకర పతాక శాత్రవుఁడు మానుహిం జనియించె నోయనన్. 39

వ. వెండియు.

చ. వసుమతియందుఁ బుణ్యాజన వర్ధనుఁడై కమలా ప్రయుక్తుఁడై
యసదృశ సద్విజాధిప ఘనార్హ్యణమూనియు మిత్రభారమున్
విసువక బూనువాఁడునయి విశ్రుతదాన ధురీణుఁడై చెలం
గునటసి జేష్ణుఁ డనఁగఁ గోరక జూడఁగ స్వామియెంతయున్. 40

సీ. విరిసి నిక్కొడిమల్లె విరుగుంపురుచియెంత
మాటుమోచిన హంస మేటి యెంత
దరులఁ దూఁటాడు శేషు ధామంబు గనెంత
నీళ్ళ మోసెడి శివుని రుచియెంత
యప్పుల పాలైన యమునాబ్జంబెంత
తృణశర నికరంబ దీప్తి యెంత
తమ్ములఁ గ్రుంకించు తారకాపతియెంత
భంగి మొందు ఫణాగ్ర ఫణమదెంత

గీ. యనుచుఁ దనకీర్తి మల్లి పుష్ప సరహంస
భోగి పతిశంభు శుభ్రాబ్జ భూరిశోని
కర సుధాంశు పయోధుల నిరసనంబుఁ
జేయ వసుధఁ జెలఁగు స్వామి నాయఁడరయ. 41

శా. కాసంగానఁగ స్వామికీర్తి గణమీ క్ష్మావ్యోమ మధ్యంబునన్
నానాదిక్కులఁ దానయై చెలఁగఁగా నాకాపగం దాపసుల్
వేనీరాడఁగఁ బోవుచోఁ గనియహో పెద్దైతగన్స్త్రోలనే
యానీరిచ్చటఁ గంటిమంచుఁ దమలో హర్షింతు రశ్రాంతమున్. 42

ఉ. స్వామి యశోవిశాలమును జంద్రుని దారిసున ధాతతూఁచఁగా
నేమముదప్పి యెత్తుడిగి నీరజశత్రువు బోలసుండినన్
దామరస ప్రభూతుఁడల దానికి నంకముగా కళంకమే
యీమహి వేయ నేణమని యెంచి వచింతురు లోకులారయన్. 43

శా. వీక్షింపంగను స్వామికీర్తి భరమీ విశ్వాభ్ర మధ్యస్థలీ
రక్షావిశ్రుత దక్షయై చెలగ భూరక్షాకుడంభోనిధిన్

వీక్షింపం బలిగాక తక్ర ఘటము న్వేకృష్టుఁడై పట్టెఁదా
వీక్షింపం గనుగాక కృష్ణుఁడుసదౌ వేసంబు లానందమే 44

ఉ. చందనశైల శృంగమున జక్కఁగఁజూచి భుజంగబాలికా
బృందము స్వామి నాయని సవిస్ఫుతకీర్తినిఁ గూర్చి పాడనా
నందముతోడ మెచ్చిహరిణంబును వేగను రాక బోవఁగా
మంద గతిప్రసక్తులను మాసవు దక్షిణ వాతపోతముల్. 45

ఉ. ఇంద్ర సమాన భోగియగు నీసనుఁడార్య నమస్య సేయుస
త్సాంద్ర విభాసితాత్ములను దానగుణాపర భాస్కరాత్మజుల్
సాంద్రదిగంత విశ్రుత ససార సుకీల నితాంతజిత్రభా
చంద్రులు నైన పుత్రులను జక్కఁగఁ గాంచెను ధన్యుఁడై మహిన్.

వ. అందగ్రజుఁడగు వేంకటరెడ్డి నాయఁడు.

చ. అరయఁగ నాఁడుఁడిబ్బుకొని యాచకకీర సురద్రుమంబయై
పరిఫల తృప్తి నిచ్చుచును భాస్వరకీర్తి నితాంతి మెంతయుం
గరము జెలంగ రాజిలుచు గర్వమదాగ్ర విపక్షకోటులన్
నురు మొనరించు చుండియు వినూతన వైభవ మందునిచ్చలున్. 47

చ. ఘనుఁడురు గర్జితధ్వనులఁ గాలమునం దమన దాతయాచు తో
డన రసహీనుఁడై యగపడంగలఁడా ఘన తెన్నవచ్చునే
వినుత గుణాబ్ధి యాఘనుఁడు వేంకటరెడ్డి యకాలమందునన్
జనులకొసంగు సంపదలు చాల గదా రసికాగ్రగణ్యుఁడై. 4

క. అతనికిఁ గనసను జన్మ
ద్వితీయము ప్రభవిల్లె రెండు దివ్యములగు దే

వతరులన నాగభూషణ
తతకీర్తియు సత్యయాయును దద్దయుఁ బృథ్విన్. 49

సీ. ఇతనిభాదళ ధూళి యీపుణ్యభువిఁగప్పఁ
గా గిరీశుం డంధ కారియయ్యె
నితనియశోగుణం బిలవిశదము జేయు
తరికాప్య నగమువ దాతియయ్యె
నితని విగ్రహమెల్ల నీక్షించి దేవతా
నికరంబు లప్పు డనిమిషులైరి
యితని విశాంగ్రీనం బీక్షించి కల్పక
తరువు నిశ్చేష్టితత్వము వహించె

గీ. నితని గుణముల కెనగాక నెసఁగనంత
రీప ముద్రలు వేయ నమృతధి యిలన
ముద్రమయ్యెనని కవులు భూరినుతులు
సల్పఁ జెలఁగును నాగభూషణుఁడు భూమి. 50

మ. జలదస్తోమము నెల్లనాత్మకృత సత్సత్రంపు ధూమంబుచే
జలజారాతి దిగంతవిశ్రుత యశస్సఖ్యాంబుచే దాన స
జ్జలధారాతటినీ లలామములచే సంద్రంబు రంజిల్లెడిన్
వలయుండాతల కెల్లదాతియని చెప్ప న్నాగభూషుండిలన్. 51

షష్ఠ్యంతములు.

క. ఏవం విధగుణవిల స
చ్ఛ్రీవారిధి కధికసౌఖ్య జితశక్రునకున్
ధీవిలసనునకు బండా
రీవంశ పయోధి శర్వరీమిత్రునకున్. 52

క. ఉద్ధిత కవిపంచజనస
మృద్ధన శుద్ధాత సిద్ధ వృజినౌఘునకున్
శుద్ధ ప్రసిద్ధ వృత్తున
కుద్ధిత చారిత్రునకు గుణోదక నిధికిన్. 53

క. సాధార వారి సదృశగ
భీరున కార్యావతంస విసరనమస్యా
ధారేయునకు విచక్షణ
వారవకోరక సగ కృపా మిత్రునకున్. 54

క. అవిరత విశ్రాణన జిత
రవి పుత్రునకుం గరుణాకర వనజగేహా
ధవపాద చింతిత మతికి
నవిరళ కీర్తిధన ధవళితా శాంతునకున్. 55

వ. అభ్యుదయ పరంపరాభి వృద్ధిగా నాయొనర్పం బూనిన కాళిందీ
పరిణయంబను మహాప్రబంధంబునకుం గథాక్రమం బెట్టిదనిన. 56

## కథాప్రారంభము.

శా. శ్రీ కాంతంబగు నైమిశాటవిం దప శ్శ్రీరంజి తాదంభ ల
బ్ధాకారు ల్శౌనికాది మునివర్యస్తోమ మాసూతు ము
న్నా కృష్ణుండు దివాకరాత్మజ వివాహంబెట్లు దానయ్యెనో
యాకర్ణింపంగ హర్షమయ్యెడి మహాత్మా తెల్పవే మాకనన్. 57

క. సూతుం డిట్లను దగనా
పాతమున దినాంత తాండవ గిరీశ శిర

స్రోతస్వినీ ధ్వనిగతిని
నాతాపస వరులజూచి హర్షం బెసఁగన్. 58

సీ. రుచిర మణులకెల్ల శుచిసదాకరసీమ
పరికలాపములను బరికెచూడ
పరిసుమనోలసత్తరులకా వాలంబు
కళ్యాణములకెల్లఁ గాంత గృహము
వరపుణ్య నిధులను సరసాల వాలంబు
హార్యావళులకెల్ల నాదిమనికి
వివిధ భాషణ విభాద్విజకోటి నిలయంబు
సరసుల కుద్యాన సరణిచూడ

గీ. బరగ రంగ సుస్రోతోద్భవ వసతికి న
యుంగ నాటపట్టు వివిధ మంగళకర
వాద్యములతోడ రంజిల్లు వార్ధి మధ్యఁ
బొలుపు విలసిల్ల ద్వారకా పురవరంబు. 59

చ అలఘుమహత్త రోజ్వల పురావరణాగము బొల్చురత్న కం
దళముల మధ్యబొవ్పుఁటగన్ భృశమంచును నెంచినవ్యతన్
జలరుహగర్భుఁ డాభువన జాతశతాంగము నేకచక్ర కే
వలముగఁ జేసెఁగాని నడువన్రవికి న్నభమందు శక్యమే. 60

మ. నగరీక్షేయ సముద్ర భూరితరస న్నవ్యాంబు పూరంబు జి
హ్మగలోకం బతలంబొనర్పఁ గనియా యబ్జాస నుండంత బ
న్నగ గోత్రోద్భవులం జలంబుపయి నానందంబుతో నాడగా
నగరంబుం దయవారగా నురగుల న్మోదానఁ జేసెన్భువిన్. 61

స్థ్నలి నంటంగను బోసి మిత్రువసు వైళోల్యోజ్జ్వలుం జేసె పే
శలకాంతిం జెలఁగుం గిరాతకుల సత్సంగాత మవ్యోటిలోన్. 65

ఉ. బలిఘునసచ్ఛిఖామణులు పట్టణమందు రచించు సట్టి య
త్యలఘుక ధాన్యకూటసగణ మ్మఖకరాన్వితి సాంద్రశీకరం
బుల మొలక ల్లజ న్విమలచయమూరుభుజించ నల్బ్చ వారితోఁ
బోలుపుగఁ బుట్టు సస్థవది పుష్కరవ త్త్రిగన్వసద్ధ్వనిన్. 66

మ. అహితానీకవిభంగసంగములు నిత్యాత్యర్థ దుస్థానవా
గ్గ్రహపక్షాంతరనిర్గతోగ్రపవనాఘాత బృక్ష సంచారులన్
బహుమార్గంబులఁ బోవద్రోలుచును గుంభస్థానిర్యన్మధా
గ్రహమ ప్పట్టణ మంత బంకిలము గాఁగం జేరెడు మత్తేభముల్.

చ. హరిహయులం బ్రభంజను హయంబును జేసము క్రొహలు స
ద్ధరిణిఁ బయోజనాథుని హయంబును వాయువు బంచధారలన్
బరిభవ ముందువారలుగఁ బ్రాభవ మొప్ప జయించియున్ సదృ
క్షరహితమై చెలంగుఁ బుర సప్తిగణంబు విశుద్ధచిహ్నమై. 68

మ. లలితైణాంక శిలావినిర్మితపురీ లాలిత్యగాంగేయపీ
ఠుల హైరణ్యశతాంగచక్రహతతత్క్షోదంబు లైనింప లో
కలలామాపగ పంకిలంబుగను వేగం జేయు న్నింపు ను
జ్జ్వలమై యొప్పు ను నిత్య సంచోచ్ఛటను స్థాపితమైన పాంథామరల్

ఉ. సాంకవగంధు లిందుమణి సౌధతలంబుల నొల్లసేయ ని
శ్శంకత తత్కచాభ్రమును చారుతనూలతికా సౌజన్యవయిలు,
ఘూంకములట్లు దోఁపఁగ శిఖావలము ల్గని భిక్షాన్నము వ
త్స్వాంకముచేత సల్పు విమలాకృతి సప్పాత్తుం డని నింద 70

మ. చెలగుం దత్పురి గోపురాంచలమునం జెన్నొంద నిర్మించి పు
ష్కల వర్ణం బగు బద్మరాగమణు లా గాంగేయ శైవాలినీ
విలస త్పంకజ మంజిమం దనర దిగ్వేదండము ల్రాకబోఁ
జెలువొంద న్స్వైరబొమ్మలుంచిరొ యనన్ జిత్రించు హర్యక్షముల్

సీ. పంకజారికిని కళంకమునుంచినదూరుఁ
దమ్ములఁ బంకానఁదార్చు తప్పుఁ
చిగురు టాకులయందు జిగి యుంచని కొఱంత
ఘనులఁ గొండలపాలు నొనరుచు నడి
మంకెన నామోద భరితఁ జేయని రట్టు
చపలాళి కిచ్చెడి చలతరవ్వ
గనకంబునకుఁ దావిఁ గల్గించని యకీర్తి
కరిహస్తమునకు వంకర యొనర్చు

గీ. నాడిక జలుపుకొనఁ జాలు నళిన భవుఁడు
పూని యప్పురి వనితల యాననాక్షి
హస్త ధమ్మిల్ల రుచిరోష్ఠ హారవిగ్ర
హాంగరుచి గోరువుల సొంపు పొంగఁ జేసి. 72

మ. అరయం గాఢ కకుద్మతీకుచభర వ్యాజంబునం జూడఁ బు
ష్కరసంచార మశక్యమంచు మదిలో సంకోచముం బొంద ని
ర్భరరుక్మాంచిత మైన మాడువులు శోభన్మందు గన్పట్టని
ర్జరరామామణు లందు నుండిరొ యనన్ రామ ల్చరింతుర్పురిన్. 73

మ. జలజాశ్మోజ్జ్వల సౌధవీధిక సతీసంఘాత మెల్లం గుతూ
హల మొప్పంగ వయాళి జేయుదు సురాబ్జాక్షీవితానంబులోఁ

గలనాదంబుల గేరడంబులను బల్కు న్వారలుం బల్కు మా
చెలిమేడల్గను డించుఁ జూపుదురు వీక్షింపం బ్రసాదంబులన్. 74

చ. దివిజపురాధినాథ మణిదివ్యవికీలిత సౌధయూథ మం
దవిరళసౌఖ్య సఖ్యముల నంగనలుం జనులు న్మనోభవా
హవమున వాడిసోలి చిగురాకులసెజ్జలఁ జేరి నిద్రఁబో
నవగళయుక్తి మేల్కొలుపు నాకధునీచరచక్రచక్రముల్. 75

సీ. సురపొన్న పూవ్రేడి సోనిపితే చెలియది
జనియించె బల్దీవి సానుపవలదె
యలరుగొమ్మల నెత్త వది యేలచెలి యది
హేమాద్రి దాపుఁవి యెత్తఁ దగునె
నల్లగలువ చాలు నాతి మాటితే వేల
మాటఁ దగదె మిన్ను బావికడది
పొందామరలఁ బైటఁ బొదివితే చెలి యవి
పుట్టె మానసభూమిఁ బొదువ వలదె

గీ. యనుచు గోవాంద్రు వలికెడి యనుఁగు వచన
రచనల యథోచితంబుగ లలితఫణితి
నుత్తరము లిచ్చుచుండియు నొనర వీట
విరులు విలుతురు పుష్పలావికలు బ్రీతి. 76

చ. గిరిగణ్ణమైనఁ గాని బిడికిళ్లను జూర్ణము సేతు రుగ్రకే
సరి దళనంబులైనను వెసం గ్రహియించి పెకల్తు రెంతయుం
స్వరుహతినైన హస్తముల చాటున మాటుదు రాహవంబులో
స్మరహరునైనఁ గెల్తు రతి శౌర్యమునం బురిలోని సద్భటుల్. 77

సీ. కేళిసరోవర కీలాలజ విహార
మునఁ బొందు సౌరభ్య మున నిలుండు
నూతనాంశుక బద్ధ కేతనంబుల నను
బింబితుండై ప్రభ ల్బెంచుచుండ
రంజిత మైన తోరణ వితానం బూని
ఘనమారయుఁ గ మౌక్తి కములను గను
వహించల నిహిత వరమణిగణమూని
కనకతరంగిణి మణులను గను

గీ. సౌధశిఖరాంచి తైణాంక సరసరుచిశి
లాద్రుతాంబువు లిల జకోరకములపన
వితములై యొప్పుచుండ నవ్వీటి వార
లమిత లీలావినోదంబు లందుటరుదె. 78

ఉ. చందనగంధు లిందుమణిసౌధ తలంబుల గొండ్లి సేయుచో
నందెల నుండు నీలములు నాట్యవిజృంభణ చేత చిందఁ బు
ష్పంధయవేణు లల్లయవి బంభరవారము లంచు మోము ద
మ్మిం దగఁ ద్రిప్పఁ దన్నగరి మేలుగ ముంచును నీలజాలముల్. 79

క. ఆరాజధాని కధిపతి
యై రాజిలు గృష్ణుఁ డల్ల యాఖండలుడా.
సౌరపురంబున కధిపతి
యైరుచిరాభోగ గాఢ మందెడికీర్తిన్. 0

సీ. తనయుదర మ్మెప్పు డొనరంగ బహుఫుల్ల
పద్మజాండముల నివాస మయ్యెఁ

దన భవ్య లపనంబు దనరుచు నుండంగఁ
ధరణిచంద్రులకు నాస్థానమయ్యెఁ
దన మహాక్రోడంబు ధగధగద్యుతిఁ జెందఁ
బంకజాలయకు నివసిత మయ్యెఁ
దన నాభిరాజిత మనువొందు రుచిఁ జెందఁ
కమలాసనునకు నగార మయ్యెఁ

గీ. బరగ నంభోజజాది గీర్వాణ ముఖ్య
మస్తకాలంకృత మకుటన్యస్తరత్న
పూజితాంఘ్ర్యంబుజోజ్వల పురుషుఁడు జిత
కృష్ణుఁ డైనట్టి గోపాల కృష్ణఘనుఁడు. 81

ఉ. కృష్ణునిఁ గృష్ణుని న్విమలకృష్ణుని నాశ్రితకృష్ణ నుల్లస
త్కృష్ణుని భోగజిష్ణుఁ బరిజిష్ణులఁ జేసియు గృష్ణదైత్యవై
యుష్ణత నష్టనేత్రునిఁ గనుంచియుఁ గృష్ణకులోద్భవు న్విజి
త్కృష్ణునిఁ గా నొనర్చి యిలఁ గృష్ణుఁడు రంజిలు నిత్యసంస్థుఁడై.

సీ. ద్విద్వయోపాయ సుధీవతంసుఁ డగుచు
శాస్త్రవేదీశ విశారదుండు
క్రీడాప్రకందుకీకృత మందరాహార్యుఁ
డహిశిరోభాగ నాట్యస్థలుండు
క్షీరాబ్ధ్యమల పయఃకేళీసుహంసుండు
జ్యోమణిసుత సంహారకర్త
భూయశోసుభరణ ధౌరేయతాసంగుఁడు
కర్బురాటవీ మహాకాండజన్ముఁ

గీ. డనుల నిజభక్తక రథాంగ సముదయస్య
మణి సమదచర దరిదళ వనధీశ
కుంభజాతుండు రావణకుంభకర్ణ
కాలుఁ డైనట్టి కృష్ణగోపాల ఘనుఁడు. 83

చ. అనయము భూమి సస్యవతియై ఫలియించఁగ మిత్రముఖ్యులున్
మునులుఁ బ్రమోదమొందఁగను భూసురు లెల్లను నిత్యకర్మలం
దనుపమ తేజులై చెలఁగ నాఖుకదంబక మోతుభీతి ద
క్కి నివసనవ్రజంబులనుఁ గేరుచు నాడఁ బురంబు నేలుచున్. 84

వ. ఇట్లుండి యొక్కనాడు.

సీ. శనివరప్రభృతులు చెలరేగి కొలువంగ
నవనిపు లెల్ల జోహారు సేయ
విజితషట్పదబృంద వేణులు పార్శ్వంబు
లరమణ మొప్పఁ జామరము లిడఁగ
వందిమాగధబృంద మంద మొందఁగఁగొల్వ
సవయాశ్చయం బెల్ల సరసఁ జెలఁగ
విజితబృందారక వేశ్యలౌ వేశ్యలు
కొమరు మిగుల ముందు గొండ్లిసేయ

గీ. నీలమణిపుంజకర్బుర నిర్మితోడు
భాసమానంబునైన సింహాసనమున
విమల మగు ఠీవిఁ బేరోలగముననుండి
యిష్టవాక్కులఁ జరిపెడి దిష్టమునను 85

వ. శైనేయుం డిట్లనియె.

ఉ. స్థూలసుశీల నిత్యులు యశోభృశపాండురతాదిగంతులున్
లోలవిభీత తామస జలోద్భవమిత్రవిభాసమాను లా
భీలవిశాలశౌర్య జితభీములు పాండునృపాలపుత్రు లే
వేళల మిష్టవాక్కులను వేడుక నైనను బల్కరెంతయున్. 86

వ. అంత కృష్ణుండిట్లనియె

గీ. మానవేంద్రుల నిరసించు మానవేంద్రుఁ
డరయ రాజహంసల నెల్ల పరిభవించు
రాజహంసుఁడు నలధర్మ రాజసుతుఁడు
నిరుపమానంబునౌ ధర్మనిరతుఁ డతఁడు. 87

క. వారలఁ జూడఁగ మనమునఁ
గోరికలు చెలంగు చుండె గురుతర మొప్పన్
గారవమున నంచును వే
దారకునిం జూచి పల్కెఁ దద్దయు వేడ్కన్. 88

గీ. గంధవహబాంధవంబులౌ సైంధవములఁ
గట్టి తేరాయితంబుగాఁ బట్టితీర్చి
తెమ్మన మన మనంత మోదమ్ముతోడ
నొనరఁ దెచ్చెద రథ మంచుఁ జనియతండు. 89

సీ. శోడించిమణిజాల శుక్తిజంబులబమ్ము
కమ్మి గ్రమ్మిన రథాంగవ్రజముల
మహనీయ మాణిక్య మకర తామ్రాపద
మయములై నట్టి స్తంభంబు లమరఁ
దారకాతోరణ వారవారంబులు
లలితవితాన మలంకరించ

నీలంబులను దృష్టి నిల్పిన స్రక్రము
ఖంబులఁ దగునప స్కాగముతోడ

గీ. నందు దాపిన లోహిత కాళులెల్ల
బింబితంబై ప్రకాశించు పాంబరపును
గలుగు రథము నాజానేయములను బన్ని
చారుగతి చేతఁ గొనివచ్చె దారకుండు. 09

గీ. తెచ్చి యెదుటను నిలుపంగ ధృతి దలిర్ప
సాత్యకి సహితుఁడై బోల్చె సరగ నందు
సారసహితుండు గూర్చుండు సమయమందు
నరద మరు దయ్యె జననేత్రశోజములకు. 91

చ విభుఁడు రథంబు నెక్కి పురవీధిని నేగఁగఁ జూడఁగా ధరా
నిభకటి యొార్తు మధ్యమున నీటగు మౌక్తికహార ముంచి చే
యిభరకుచంబులన్ రుచిఘటిల్ల విధించియు వచ్చె మధ్యమున్
సుభవిక మెప్పఁ బ్రోవు మన స్థూలకుచంబుల వేడుచుంబలెన్.

ఉ. కిన్నరవాణి యొక్కరుతు కృష్ణునిఁ జూచుమనోరథంబుతోఁ
జెన్ను వహింను తత్తగముచే మొలనూలుశిరోధిఁ బెట్టియుం
దిన్నని కంట్లె కౌనున విధించి భుజంబుల నంజనంబునుం
గన్నుల చందనం బలఁది కాంచఁగ రాఁ గనిసవ్వ రంగసల్. 93

వ. ఇట్లన్నగరంబున నన్నుమిన్నల న్నగోద్ధారకునిఁ దిన్నని వన్నె ల
న్నియుం గన్నులారం గన్న సన్న లెటుంగి కందర్పం డిందుముఖీ
సందోహంబుల డెంపంబుల నరవింద పృషత్క బృందంబుల సం
దడింప డగ్గరి సిగ్గు వెగ్గలించి దృగ్గోచరం బైనంత వరక గ్గుణోదధి

రథం బీక్షించి యదృశ్యం బైనతరి వార్త సద్దంబులకుం జనిన యనంతరంబ. 94

ఉ. వాయుజవాశ్వము ల్ద్వారను వల్గితధాక నతిక్రమించి సం
స్త్యాయము దాటి యొక్క నిమిషంబున నే బహుయోజనంబులం
బాఱియతం బోవుచుండెడి సమర్థతం గాంచియుం కృష్ణుం డల్ల నై
నేయునిం జూచి యీరయము నీకుణ నేయు మటంచుం దెల్పినన్

వ. అనిన విని యతం డిట్లనియె.

చ. పదవిని నుండు నట్టి ఘనపాదప యూథముం గాంచితే మహా
విధిబ్రుపదస్వాం డంతమున వీచెడి గాలి సమస్తజంతులం
బృథివిని రాల్చుచుండు గతిం బెంపుగ వెన్కకు వాఱిలుచుండు నీ
రథమునకు న్విధించిన తురంగవితానము చేత నే కదా 96

చ. అన విని దారకుం డనియె నయ్య త్వదీయదయాప్రరంజితా
వనమును గాంచు పాండవుల పట్టణ మల్లదె కాంచుముజ్జ్వల
త్సనిసితశక్తి జాతగణ శోణమణివ్రజ విద్రుమావళీ
కనకమయాంచితావరణ కాంతశిఖం గతుకం బొసంగెడిన్. 97

శా. వింటే కృష్ణ పురంబులోన ఘనకుంభిధ్వాన గంభీరముల్
మింటం జూడం బ్రతిధ్వను ల్జెలంగెడి న్నీనాక్షిలోకం బదే
కంటే సౌధశిఖాంచలంబులను ఛేకం బొప్పువాహ్యాళులం
జంటల్బాయక చేసెడిం గుచభరాచంచ న్నతాంగంబులన్. 98

క. ఇట్లనుచు దేరు వరణపు
మెట్లకడ న్నిల్పి యొక నిమేషములోనం
గట్లన్ని విప్పివాజుల
జట్లములోం గట్టి తాను చయ్యనరాంగన్. 99

వ. దారకి సాత్యకి సహితుండై గోపాలకృష్ణుండు. 100

సీ. వజ్రాగ్రశిఖరసున్న కవాటంబులను దాటి
ముత్యాలతోరణములను గడచి
పచ్చశిలానిర్మిత వీధికావళి దాటి
లలితాశ్మగర్భ పట్టికలను గడచి
దివ్యమాణిక్య వేదికావితానము దాటి
రత్నకీలితపు ద్వారముల గడచి
పుష్పరాగంబులఁ బొలుపొందు నిర్మించ
వెలయు నాస్థానము గడచి వేగ

గీ. మిత్రపుత్రానుజన్మ సద్వ్రతధరులు
జేరి కొలువంగ సంతోష చిత్తమునను
భాసమానంబునైన సింహాసనమున
నున్న ధర్మరాజాదుల నొనరఁ గనియె. 101

ఉ. ఆదరి నంత కాత్మభవుఁ డల్ల యమాత్మజుఁ గన్న పద్మసం
ఘాతముఁ బోలి పాదములఁ గాంచి కుతూహల మొందు నింద్రియ
వ్రాతము భంగిఁ బొంగి మణిరంజిత పీఠిక డిగ్గి కృష్ణునిన్
బ్రీతినిఁ గౌఁగలించుకొని ప్రేమ దలిర్పఁగ నిట్లనుం దగన్. 102

క. తమ యంకపాళి కలిమిని
నమరఁగ నిర్ధూతకల్మషావళినై నే
నమలోత్సవ మొందితి నో
యమరాధిప ముఖ్యవందితాంఘ్రి సరోజా. 103

ఉ. దేవ మహానుభావ భవదీయ దయామహిమాన నేఁ గదా
భావితసత్ప్రభావముల భాగ్యముఁ గాంచి వసించు టెంతయున్

దావక దర్శనంబున నితాంత శుభాభ్యుదయాన్వితంబునై
పావన మయ్యె మాగృహము భవ్యుల మైతిమి వేయునేటికిన్. 104

క. అన విని కృష్ణుం డల్లశ
మనపుత్రానిలజులకు నమస్కారంబు
న్వినయంబునఁ జేయఁగ మ
న్నన లేవఁగ నెత్తి రధిక నమ్రతతోడన్. 105

గీ. అంతనరుఁడు గవలలు లతాంత శరునిఁ
గన్నతండ్రి పాదములకుఁ గాంక్షతోడ
నతుల నొనరించి నిలువంగ నతుల మతిని
వారి దీవించి పీఠిక వరల నుండ. 106

క. అంచిత ఘనకుచభారా
కుంచితయై నూత్న పుష్ప కోమలి యగుటం
గొంచెము సిగ్గు జనింపఁగఁ
బాంచాలి నమస్కరించెఁ బద్మాక్షునకున్. 107

గీ. అంత శైనేయుఁ డబ్జకులావతంసు
లైన పాండవేయులచేత నర్హణంబుఁ
బొంది యొక్క పీఠంబునఁ బొల్పుమీర
నధివసింపఁగఁ దారకాద్యనుచరులను. 108

వ. ఉచితాసనంబులఁ గూర్చుండ నియోగించి యయుండు నవసరంబు
న యుధిష్ఠిరాదులు వెంటరాఁ గృష్ణుండు గుంతీదేవి సదనంబునకు
జని యభివందనంబు సేసి యిట్లనియె. 109

శా. అత్తా కోడలు నూను లూడిగము సేయంగాను భూయిష్టమౌ
చిత్తానందముతోడ నిచ్చలును నీచేతఃపదంబందు నే

విత్తులేక జరించుచుందువె మహావిజ్ఞానులౌ పుత్త్రిలా
యత్తంబౌస్థితి నీయనుజ్ఞలఁ బ్రమోదాత్యర్థత న్విందుకే. 110

మ. అన దగ్గుత్తిక గుంతి యిట్లనె మహాత్మా యేమి వాక్రుచ్చుదున్
ధనగర్వాన సుయోధనుండు ఘనమా దౌర్జన్యము న్మా కొన
ర్చిన యిక్కట్టుల నాలకించితి కదా లీఘంబుగాఁ దెల్పెద
న్వీను మంచుం దన పుత్త్రిలొందిన మహావిత్త్యాపులం జెప్పియున్,

సీ. బంధుజాలమటంచుఁ బరికించుచుందువు
నీవు పంపించిన నెమ్మితోడ
మాయన్న యరుదెంచి మముగాంచి పోయెను
నేటినుండియు దిక్కు నీవెకాక
యెవ్వరుండిరి మాకు నేవిధంబునఁ జూడ
నిలసర్వజంతు జీవేశ్వరుండ
వట్టి నీకు మనవారని వారివారని
భేదమించుక లేదు విశ్వరూప

గీ. మాపురాకృత పుణ్యక ర్మంబు కలిమి
నిరుపమానమౌ నీదయానిర్గలంబుఁ
బొంది యుంటిమి యో మహాపురుష రత్న
యదుకుమారవరేణ్య బుధాగ్రగణ్య. 112

వ. అని యుధిష్ఠిరుండు దన్నుం బ్రార్థించిన నింద్రప్రస్థపురంబు వారల
కు నేత్రామోదంబు సేయుచు శ్రీకృష్ణుండు కొన్ని మాసంబు ల
న్నగరంబున వసించి యుండె నని సూతుండు శౌనకాది మహాము
నులకుం జెప్పిన విని వార లవ్వలి కథావిధానం బడుగుటయు. 113

శా. అర్ణోరాశిగభీరధీర వరగంగాథంగవీచీనిభో
దీర్ణశ్లోకవిభాపిధానఘన రాత్రిస్వైరసంచారగో
కర్ణవ్రాతవిభూషనూపురవచోగాంభీర్యలీలాస్పదా
యర్ణోజేక్షణ పాదపద్మమనుపాత్తా సద్గుణవ్రాతమా. 114

క. కాండభవనేత్ర సుమనః
కాండావిదళద్వి నూత్న కనకసుగంధీ
కాండ గుణకాండ విద్యా
కాండజినీ ఖేల దమలకంజజనాహా. 115

ఉత్సాహవృత్తము. వర్ణనీయ కీర్తి వైభవ భరపరభవోగ్రస
జ్జార్తి మార్గ నిత్యలహరి మహా నాట్య తోయస
ద్వర్ణ సర్వగుణపరిభవ ఘనతర్ణి పుత్రగో
కర్ణకుండలాంఘ్రిసమద కాంతపుష్పదాత్తకా. 116

గద్య

ఇది శ్రీమద్రామచంద్ర చరణారవింద వందన జగత్ప్రాణనందన
ప్రసాదాసాదిత కవితా నిర్వాహక ధూళిపాళ సూర్య
నారాయణ తనూభవ బుధజనవిధేయ వేంకట
రామనామధేయ విరచితంబైన కాళిందీ
పరిణయంబనెడి మహాప్రబంధంబు
నందుఁ బ్రథమాశ్వాసము.

---

నలినీచ్ఛదానీ కమలినీకృతస్రవం
త్యంబు భవ నట ద్రథాంగవాక

గీ. మతి మనోహర సలతాంత లతికలందు
దర్పకాస్కందవాత్యంత దాంతి లబ్ధ
కాంతి కలకంఠి గణ కంఠకాకలీవి
భాసురము వొల్చు మధుమాస వాసరంబు. 4

సీ. కాలబిడౌజుఁ డగచ్ఛదచ్ఛేదనం
బొనరించ భువిరాలు తునుక లనఁగఁ
దారు నిల్వుటకు నాధారమౌ ధాత్రికి
లతకూన లిచ్చు వస్త్రిను లనంగ
సులతాంగనల దాని సోకుడుదయ్యంబు
రహి నూడఁ దీసిన రవికె లనఁగ
వనదేవతా గాత్రమున వసంతుం డుంచి
చెలు వొప్ప నూడుచు చిక్కస మన

గీ. మదను రాక నెఱింగి య మ్మాధవుండు
సరణి యందునఁ బరపులు సొరిదిఁ బరచె
ననఁగఁ బండుటాకు లతిశయముగ భూమి
నమర రాలియుండె వనాంతరముల. 5

చ. ఒనరఁ బురాణపత్రముల నూడిచి కోమలపల్లవంబులం
దనరిచెఁ గాననేందిర ముదంబున మాధవుఁ గాంచియుం బురా
తన మగు మండనంబులను దథ్యము గా నెడలించి రత్నభూ
షణముల సంతసం బెసఁగఁ జారుగతిన్ ధరియించెనోయనన్. 6

మ. చిగురుం గైదువ జోదు మంజుల మహా స్నిగ్ధుండుగాఁ బొల్చునా
శుగపోతంబుల తా వధూజనము లస్తోకంబులౌ శీధువుల్
దగ స్నానం బొనరించి డోలల ఘనానందంబునం బెట్టి యొం
టిగ జోల ల్దగఁ బాడుచుండ్రు కలకంఠీనాద గేయంబులన్. 7

చ. తన ప్రియమిత్రమైన యల తమ్మికిఁ దాఁ బగయై భృశంబుగా
జనులకు బాధఁజేసియుఁ దుషారగిరీంద్రముఁ జేరె మంచు దా
నిని సమయింతునంచు నలినీప్రియుఁడున్ ఘన లోకబాంధవుం
డు నగు దివాకరుం డరిగెఁ దోరపు వెల్గున నుత్తరాశకున్. 8

మ. ఎలమిన్ హృద్యమునా రుచిం దనరుచుం బృథ్విన్ వసంతంబుసం
ధిల హిందోళక రాగ మారయఁ గడున్ హిందోళవేణీవ్రజం
బులు బాడం గమకించి రంతట పికంబు ల్మావులం జేరఁ బో
ఖలకాకవ్రజము ల్కడంకఁ దరిమెన్ ఖండించి కారుణ్యమున్. 9

చ విరివిలుతుం డనేటి యల వేలుపు చల్లని గాలి తేరిపైఁ
దిరముగఁ గూరుచుండి వసిఁ ద్రిమ్మరుచుండ లతాపురంధ్రు లా
సురుచిర సాలసౌధముల సొంపుగ నెక్కి కిసాల మ న్గరాం
బురహాములం బ్రసూనములఁ బోతురు భావిశుభంబు లొందఁగన్

మ అలరుఁ గైదువుజోదు ఱేఁడు శుకవాహం బెక్కి వాహ్యాళికిం
జెలు వొప్ప న్వని కేగుదెంచు ననుచుం జెన్నొందు రాగంబుతోఁ
గలకంఠావలి సెప్ప మాధవుఁడు ఛేకత్వానఁ గట్టించు శా
లలనంగం జిగురించి మావు లురు లీలం గ్రాలె నయ్యామనిన్. 11

సీ. మావి మేడలు ఘుమఘుమ తావులలర
నలరుగంధంబు ధూపంబు హోరి యొప్ప

వేయుచుండురు నా సుగంధాయతేసును
గత మధువ్రత వారంబు గరము వొల్చు. 12

చ. అల మధుమాసవేళ జలజాయతనేత్రులు క్రీడసల్పఁగాఁ
గొలకుల పజ్జఁ జేరి కరగ్గిపూవుల నుండి జారు నా
జలకణ సజ్ఝరీ నికర సారణు లల్ల తటాకశంబరం
బులఁ గలయంగ నుంగొనుచుఁ బొల్పగు జల్కములాడి వెంకయున్

శా. భోగాత్ముం డగు పారిజాతతరునిం బూజింతమంచు న్నెస
త్స్వర్గోద్గాఢజితేభయాన లగుచు న్విన్నాణమౌ పూవులన్
రాగాంభోరుహ చారుసంఘములు శీరంబు లిక్కాసాలాపులన్
యో గేచ్ఛామతిఁ బూని యాత్మసఖులన్ హూంతి. దగం జేయఁగన్.

సీ. అంబుజనేత్ర పుష్పంబు లందియ్యవే
కోకిలవాణి చిగుళ్ళు దేవె
భ్రమరాలకా మకరందంబులను దేవె
స్వర్ణాభాంగి దీపంబుఁ దేవె
నవహంసగమన మృణాళంబులను దేవె
శశధరాస్య సుధారసంబుఁ దేవె
బింబోష్ఠి సరసఫలంబు లెల్లను దేవె
పద్మసుగంధి ధూపంబుఁ దేవె

గీ. యనుచుఁ దమలోనఁ జెలులు సయ్యాట మెసఁగ
వనవిహారంబు సల్పుచు వనజశరునిఁ
బూజ సేతురు మధువేళ నోడ మెరయు
సార సారస కాసార తీరములను. 15

శా. శా [illegible] ండల పత్రఛేదన లసచ్చాతుర్యమై పద్మినీ
వా [illegible] న చ్ఛుభ కంకణగ్రహణ జృంభంబై లసన్మాగధీ
స్తో [illegible] ౌజ్జ్వల్య మనోహరభ్రమర కాస్తోకానఘామర్దమై
వా [illegible] బొప్పం జరించె గంధప్రపదశ్వం బవ్వనాంతంబులన్. 16

వ. అం [illegible] 17

సీ. పక్వ [illegible] ర కదంబక వినిర్భిన్నము
క్తాస్ఫోటజాత సంఘములు కొన్ని
స [illegible] మదభ్రోడ సంఘాత భేదిత
మయి యొప్పు బుట్టుదేనియలు కొన్ని
వర [illegible] పునర్భవ శిఖరచ్ఛిన్న సా
రంగనాభిని వాళ్లు రజముకొంత
మద్ది బొం జేరెండ మరగి క్రలనంటి
వలపులు చెలంగు జవ్వాదికొంత

గీ షా [illegible] లనుండియు ఘనసార తరువులందు
దస [illegible] దాబడు కప్పురము నిభదంత
స [illegible] యము చిటిచాపలుం గొంచునరయ
న [illegible] పాలక [illegible] రంబ మట్టితరిని. 18

ఉ. వే [illegible] కసన్నిభ [illegible] బు లగుమేనులతోడ విశేషవస్తునా
రా [illegible] చయంబు బృష్టమున రంజిలఁగోరశిఖ ల్చెలంగఁగా
వా [illegible] దకపంక్తు నెల్ల ఘనమోద మెసంగఁగఁ గొంచువచ్చి వై
రోనని పుత్తురి మ్రోల నిడి రూఢిగఁ బల్కి రరణ్యపాలకుల్. 19

క. సామీ యేమని చెప్పెద
మామనికిం దావు లైన యడవులలోనన్

గోమల కామ కలంబ
స్తోమము మృదుతరపు జిగురు జొంపము చేవల్. 20

ఉ. క్రీడ వనాళినీయెడ శుకీ నినదంబులు సెప్ప నేల భూ
పాలక తేటు లల్ల సురపాదప హృద్య లతాంత మాకరం
దాళి కచాలమెక్క నివహంబులు గట్టి రొద ల్సెలంగ రా
నీల వలాహకంబు లవి నీలగళోర్భటు లెక్కువారయన్. 21

సీ. జియ్య యేమేమని చెప్పుదు మియ్యెడ
నిచ్చావిహారాన నేపుమీఱి
పొలముల యందు నామునఁ ద్రుళ్ళుకొంచును
బుట్టకూడుల దిండిపోతులు నులి
గొమ్ముల మెకముల గుంపు లామునఁ బొల్చు
బలుహజ్జమెకములు శలలములును
జముసెక్కిరింతలు జడలమెకంబులు
పొడలమెకంబులు పులులు మరియుఁ

గీ. బెక్కులును జేరి నిచ్చలు లెక్కలేని
రొక్కములఁ బొల్చు నిసువుల లోతుగాను
వెల్లగించుచుఁ దినిపోవు నుల్ల మెరయఁ
గండకావర మెచ్చంగఁ గారడవుల. 22

సీ. చంద్రనిప్పులతోడ సరివచ్చుకన్నుల
నొకదానిపై కెక్క నొకటి దవురు
ఖర్జూషినాశంబు గలుగంగ రాయుని
తంబంబునం బడఁ దరువు లెల్లఁ

జీమ చిటుకు మనఁ జెలరేగి తిరుగుచు
బలు వాడి కొమ్ముల సెలవుచెల్ల
సట లుబ్బగను వీపు జప్పరించునుదంష్ట్రి
కుచిచొంగచేతను చుంయి మనఁ గఁ

గీ. గొలకులను జేరి రొంపిలోఁ గూర్మి మీఱఁ
దారుమారుగఁ బసుపు దొందరలు గాను
నిండు వేడుక మనముల నిండి యుండ
నిచ్చఁ దిరుగు నటవిని ఘోణివ్రజంబు. 23

క. జియ్యా యేమని చెప్పుదు
మయ్యా పొడిచిన పృషత్క మందునఁ జముఱుం
బొయ్యంగా వల దగ్గని
వెయ్యంగా నెయ్యి జాఱు వివిధవిధములన్. 24

చ. బల మది యేమి చెప్పుదుము పార్థివశేఖర గాఢమస్కరం
బుల పెడెముల్ గసుంగొనుచు మోరలతోఁ బడఁద్రోచి చొప్పులన్
బలువిడి విర్చి నట్లడవి పందులు తొండములేని యేనుగుల్
సెలవుల ఫేన ముప్పతిలఁ జిట్టలతో దిను సగ్రధాన్యముల్. 25

క. గిట్టలు నాలుగు రేగడి
మట్టిని దిగఁ బడగ లేళ్ళ మల్లడిఁ గొన నా
దిట్టములగు గొరకలచేఁ
గొట్టంగా వలదు నడిచి కొట్టఁగ వచ్చున్. 26

గీ. ఒకటి రెండు మూఁడు నొనరంగ నాల్గైదు
కొమ్ము లందుఁ బిల్లకొమ్ము లలర

వీపునందుఁ గండ లేపున కట్టించ
దొరకునె యెందు మనసు దుప్పు లచట. 27

ఉ. ఆమున క్రుళ్ళుకొంచు బలుహజ్జమెకంబులు గప్పవట్టియున్
గాను మెసంగఁ బృష్ఠమును కంఠము నొక్కటిగా మదించియున్
వేమరు గొప్ప బీరములు వెట్టుచు జొళ్ళగఁ బోరుచుండఁగా
నామృగరాజు వచ్చిన ధరాధిప పోరును మాన వెయ్యెడన్. 28

క. బండగులదాపు డీముల
నిండగు కోపమున మృగము నిపుణతతో సం
దుండెడు మచ్చుం దినఁజన
నిండుగ కొమ్ములకుఁ దగుల నీడ్చుక పోవున్. 29

గీ. కాశ్యపీశ యల్ల గాఢేయ మూషక
సముదయంబు జేరి సతత మవని
బోతరించి పెద్ద బొరియలు గావించె
జల్లెడట్లఁ బొలిచె నుల్ల మెరియ. 30

క. అని యిట్లు జెప్పకొను నా
వనపాలక సంఘముల నవనిపాలకుడున్
ఘన దృష్టిం గనుఁగొని ఘన
ఫణితిం దగఁ బల్కె గౌరవంబులు మీఱన్: 31

మ. ఖలశార్దూల మృగాలఁ బట్టి యసిచే ఖండించి శేషించు నా
శలలీ సింహవరాహ ఖడ్గ చమరీ సారంగ గాంధేర కో
కలులాయోగ్ర మృగాద నాది మృగసంఘాతంబులం గొట్టి మీ
పొలముల్ నూడఁగ నత్తు వెల్లి జనుఁడీ పాల్పొంద మీరిండ్లకున్.

క. అని వారలఁ బంచియును
ర్జును వీక్షించియును నీవు చొక్కముగాఁ గృ
ష్ణునితోఁ జయ్యన నడవికిఁ
జని మృగములఁ ద్రుంచు భృత్యసంఘము వొగడన్. 33

చ. అన విని కృష్ణ ఫల్గుణు లహస్కర పౌత్రునిఁ బోల నెంచి యో
జనవర మీ యనుజ్ఞలను సత్యపథంబుల నిర్వహించఁ గా
వనముల కేగి దుష్టమృగ పఙ్క్తుల ద్రుంచియు భృత్యకోటికిన్
దనివి యొసంగి వచ్చెదము తథ్యము పోయెద మంచుఁ బల్కినన్.

గీ. ధర్మజుండను మీరు సిద్ధంబుగాను
గాలిబంటులు వెంటరాఁ గాననమున
కేగి మృగముల వధియింపుఁ డెందు మీక
సాధ్యములు లేవరయ నీ త్రిజగములందు, 35

క. అని యంపఁగ నగుఁ గాకని
మనమునఁ దోషంబు హెచ్చ మంజ్వవరోధం
బున కేగ ధర్మనిర్మిత
మణిపీఠంబులను నిల్చి మగువలు వేగన్. 36

సీ. నిటలభాగమున మణీమయ మైన పా
పట బొట్టు ధగధగ నటన మాడ
కరనళినంబులఁ గనకపు గాజులు
కాంతు లీనుచు ఘల్లుఘల్లు మనఁగ
దగుత్రళులిద్వంద్వంపు తాటంక రుచు లల్ల
చెక్కిళ్ళపైఁ బొల్చి చిందులాడ

ఘర్మలవంబుచేఁ గరఁగి కాశ్మీరంపు
చిత్రకముల తావి చెలఁగుచుండఁ

గీ. గుచయుగంబున హారముల్ గునిసియాడ
నీటు మీఱంగ నాకామినీద్వయంబు
సరస చంపక తైలంబు సారిది నంటె
జిష్ణుప్రియపుత్త్రికను నలకృష్ణసఖను. 37

ఉ. తేటలు నైన గొజ్జగుల తీర్థములందున మజ్జనంబులన్
వాటముగా నొనర్చి మృదు వాలములందు సుగంధవాసనా
పేటిక లెల్ల వేసియును పెంపుగ వంశక మంటుచుండఁగన్
నీటుగఁ గుంతలంబులకు నేర్పుగఁ జిక్కులెడల్చి వెండియున్.

చ. బలు రతనంపు చెక్కడపు పళ్లెరముల్ దగ నుంచి యందులోఁ
పల కలమాన్నముం గనఁగఁబండ్లును గూరలగుంపుఁ బిండి వం
టలునెడ నీర్శసాయన గణంబులు తేనియ జున్ను వెన్న బ
జ్జిలు దధి యూరుగాయలును జొక్కమెలప్పఁగఁ బెట్టఁ దృప్తులై.

క. కనకంపు పళ్లెరంబులఁ
గన స్వచ్ఛపు నీళ్ల ధౌతకరపంకజలై
ఘనసార చందనాదుల
ననువొప్పఁగఁ బూసి విడ్య మందియు వేడ్కన్. 40

గీ. వనవిహారంబుపైఁ జాల వాంఛ మీఱఁ
జిత్త మందునఁ దోషంబు చెలఁగు చుండ
నోలగంబునఁ గేతెంచి యొక్క భటునిఁ
గాంచి వాహంబులను దెమ్మటంచుఁ బలుక. 41

సీ. అష్టాపదంబున నలరారు వాగయు
ముత్యాలఁ గూర్చిన మొగముపట్టె
రాణఁజెలంగు సైతాణంపు సింగాణి
తళు కైన బాణాల తరకసంబు
పారశీకపు జీని పక్కెర గుజరాతి
దేశకేవడమును గాశకోక
కొలనుల గ్రొవ్వాడి బలు సిరాజీకత్తి
వాడిగొరకదోన ల్వారలఁ బన్ని
గీ. విజిత ఝంఝానిలస్యద భృశము లైన
సైంధవద్వంద్వమును భర్త సన్నిధి కవి
లంబితం బొప్పఁ గొని వచ్చె లలిత గతుల
నిచ్చమీరంగ నపుడు సాహిణి యొకండు. 42
క. తెచ్చిన మావుల ధర్మజు
నిచ్చలు నెరవేర్చ నతని హృదయము మెచ్చన్
రెచ్చుకొని చూచు బంధుసు
హృచ్చక్రం బెల్లఁ బొగడ నెక్కిరి ప్రీతిన్. 43
వ ఆ సమయంబున. 44
ఉ వీరపు గంధసారమును బెక్కుగఁ బూసియు వేసి గండపెం
డేరము లంఘ్రుల న్నిలిపి నీటుగఁ జిత్రకము ల్ధరించియున్
భూరి మయూరాంగదంబులను బూనియుఁ గాసెలఁ గట్టి ఘోరవతా
ధీరతతోడఁ బోయిరి క్షితీశుని మ్రోల నృపాల నందనుల్. 45
చ అరయఁగ దిజ్మదావళము లైన బలంబున గెల్చి నాదినూ
కర చరమాంగ మైన నల క్రవ్యము దాఁ దినఁ జింపఁ జాలు పు

స్కందచర పక్షిఁ జూపినను జాడలఁ బర్వెదు భూమిపైని వ్రా
లరయుము తోడ నాగొలుసులం గొనివచ్చిన కుర్కురావళుల్. 46

క. అత్తెములనుండి యెగురుచు
బత్తెంబుల వెదికికొనుచుఁ బదనుల మీఁదన్
గుత్తుక లెత్తెడి పేఁగల
మొత్తముతో నడచి రథిపు మ్రోలఁ బుళిందుల్. 47

చ. నడుముల నీలి దిండ్లు వెస నల్లని కాంతుల నీనమోముపై
విడబడి పల్లవెండ్రుకలు పెక్కులు గాన్పడ మోటకత్తులున్
వెడదలుగాఁగ మూపులను వ్రేల్గఁగ విండ్లును విండ్ల గాసెనల్
పిడియములఁ ధరించి యరవెన్నృపు మ్రోలఁ బుళిందసంఘముల్.

సీ. సట లుబ్బఁగను వచ్చు స్తబ్ధరోమము నైన
బాకుచేఁ బొడుతు నీపాదమాన
మద మెక్కి పొగలాడు మాతంగములఁ జెవిఁ
బట్టి నేఁ దెత్తు నీపాదమాన
యజశోణితముఁ ద్రావి యరచు వ్యాఘ్రము నైనఁ
బరువారి పొడుతు నీ పాదమాన
జంట గూడియుఁ బోరు సైరిభంబుల నైనఁ
దన్ని చంపుదు నీ పదంబులాన

గీ. యూరములఁ బొల్చు శల్యప్రవారములను
పుచ్ఛములఁ బట్టి కొట్టుదు మిచ్చమీఱ
నితర దుర్బల మృగపఙ్క్తు లేమి లెక్క
యనుచు ననుకొంద్రు మృగయులు దనివి మీఱ 49

వ. ఇట్లరిగి యమ్మహాకాననంబుఁ బ్రవేశించి యచ్చట నిచ్చనిచ్చలుఁ వి
చ్చలవిడి శాద్వలంబుల మచ్చిక లమ్చుపడ సౌదామనీ చటులం
బగు నేత్రచ్ఛవిప్రకరం బాశాతటంబుల వ్యాపించ విటతాటంబు
లుగా విడఁగొనిన ముఖంబులతోడ వేణీరసజ్ఞా కిసాలోల్లిహ్యమాన
కాయంబులగు వాతమృగసంఘంబులచేఁ గనుపట్టు చెలికపట్టులును
క్షుధాతిశయంబున బిట్టార్చుచుఁ బుట్టకూటికై వాములూరు సందో
హోపకంఠంబులకుం జని భిదుగనిశిత నిజ ఘనఖరాగ్రంబులచేఁ ద్రవ్వి
పిపీలికావళులం బీల్చి చెలంగు చుండు నెలుంగు గుంపులును, చెవరి
గా ఘననికుంజంబులం బడి గాత్రంబుల మాటుపఱచుకొని యుండు
మహాకాకోలాంచత్కాకోదరంబులం బట్టి లూమంబు లాదిగాఁ
బట్టి భక్షించుచుండెడు సెలవులనుండి బయలు వెడలి ఫేనంబులం గల
సి మాణిక్యంబులు రాలుచుండ నెమ్మది నికుంజంబుల బయలు వెడలు
కాఱుకొమ్ముల మొకంబులను మానిసి నల్లం దాఁగి మఱుఁగుఁగొని వి
యత్తులం బవర రౌద్రంబున వేయు పెద్ద రంకెలకు నలుదెసలం
బ్రతిధ్వను లిచ్చుచుండ మాటులం జేరుచుండు వ్యాఘ్రంబులతో
డను పెద్ద రంకె లాలకించి తండోపతండంబులుగా నీరంబులు వెడలి
లూమంబు లెత్తి పెట్టికొనుచుండ మేచక వితానాలినీకృతకకుప్పృష్టాలచే
రేచులు తమకొలపు సామియైన కన్యాఖను బురస్కరించుకొని
శార్దూల నికురుంబంబులం జట్టి చట్టి కంఠస్థ మస్తిష్కంబు మెక్కి
తృప్తిఁ బొంది పోవ మశక పుత్తికాదులు మూఁగ కాక గృధ్రంబు
లు జేరి మాంసఖండంబులఁ బాదంబులఁ దన్నుచు భక్షించు
చుండు మృతవ్యాఘ్ర కళేబరంబులను బెండ్లోంటిం దాకి పేరెంబులు
వారి కప్పించి తప్పించుకొను కృష్ణసార ఖురపుత త్తోదంబు నిరిగి

ముట్టి ఖద్యోతజృంభణచ్ఛవిని మాటు జేసి మసమసక లెసఁగ మరుగు వడి యుండు గంధాశ్మంబులు పెళిల్లు పెళిల్లు మను శబ్దంబు లీన పిండీభూత శితేతరప్రస్తరపాటవంబులైన విషాణంబుల నొండొంటి దాకి పోరుచుండు లులాయంబుల ప్రతిధ్వను లిచ్చు దరీనికురుంబంబులును ముందుముందు వ్యాఘ్రుండు విసయొడ్డి సంఘటించిన సంవననంబులం బడి బెగడి య క్రొయ్యా నీడ్చుకొని నికుంజంబులం దరియం బడి యవ్వలికై పోవ లేక గెడసి స్వపాద తాడనంబొనర్చుకొను మనుబోతుల యాక్రందనంబున సందడిఁబడు సర్వంబులును గల విషమప్రదేశంబులం గనుంగొనుచుఁ గృష్ణార్జును లిరువురు వేటకాఁడ్రం జూచి వాద్యంబుల నొనర్చుం డన భేరీమృదంగాది వాద్యవిశేషంబుల సందడించు నవసరంబున. 50

మ. హ్రదవార్నిర్గతఘోణినాయకము వక్షోంతస్థలక్షిప్తడిం
భద్రుఢాంచద్గతిమర్కటీవ్రజము గాఁవగాఁహాభల్లూకమున్
సదరైణాహుత దావమావళిరపుచ్ఛస్వైరగచ్ఛత్తర
క్షుద్వృషవ్యూహమునయ్యెఁగాననము సంక్షోభంబుతో నత్తరిన్.

క. అత్తరి బీరంబులు సెడ
మొత్తములై కారుదున్నపోతులు వారెన్
ముత్తెరపు సూకరంబులు
గుత్తుక సెడ ఘుర్ఘురించి కుంజములఁ బడెన్. 52

క. అత్తరి యమునాంభోరం
గత్త్రివ తరంగశ్రేటికా కృతిబంధల్
మొత్తములై యుండఁగ విం
డెత్తక కుక్కలను విడచి రేపుగ మృగయుల్. 53

క. వేగంబున జాగిలములు
సాగన్ శరజవములొప్ప సంతసమునుర
ద్వేగంబును చిత్తంబుల
రాగుకొనంగను కిరి విసరంబుల కొలకై. 54

సీ. తరుచు కూతలు వెట్టుతరి చంద్రనిప్పుల
నీడైన కండ్లచే నిక్కి చూచు
విడబడ్డ కుక్కలు వేసఁ దన్ను బట్టరా
ఘుర్ఘురించుచు బయ ల్గొక్కుమ్ము జిమ్ము
నెగసి తన్బట్టిరా నెద జీరి కుక్కల
నల్ల మోమున జార నాకు నుండఁ
బాలచేరులువట్టి పడలాగు శ్వానాల
బలిమి డొంకల సేర్చి బరులు వెట్టి

గీ. పిడియపుం బోటులకుఁ దన ప్రేవు లీదు
లాడఁ బో లేక నీరాల నలసి చేరె
యీసులను జూచి దగ్గర కెవరినిఁ జొర
నీదు బెండు వడి యొక ఘోణి వర మపుడు. 55

గీ. అట్టియెడ వేగ మృగయు లాహారములను
జూపి శ్వానంబులను విడ్వఁ జోద్యముగను
పిట్టగుంపుల గోళ్లచేఁ బట్టి చంపెఁ
బక్కులన్నియు దలవంచి పడెను దరుల. 56

ఉ. బీరము లొప్ప శ్వానములు భీకర భంగిని సూకరావళిన్
జేరగ వట్టి యుక్కడఁచి చిత్రగతిం దెస లెల్ల ప్రయ్యఁగన్

ఘోరతరంబులైన ముఖగోళము లెత్తి రవంబు లిమ్ముమన్
వారము జేసెఁ బ్రేతకిరివర్గములం దము మెచ్చ వేటలన్. 57

ఉ. అంత కిరీటి భాసుర శరావళిఁ ద్రుంచె వరాహ ఖడ్గ వా
సంత మృగేంద్ర కాసర నిశాపరిభూతనిజాంగ కాంచితా
త్యంత తరక్షు కోక సముదాయ శలవ్రజ భల్లుకావళిన్
వింత యొసంగ బాణములు వేయుట బోవుట గాన కుండఁగన్. 58

చ. పొలములఁ జేరియు న్నడిచి బొత్తులఁ జేయుచు నాము వట్టియున్
వెలఁగు శశంబులం గిరిక చిహ్నల మూషక దీర్ఘదేహాలన్
లలిని చమూరుదకీ ప్రజముల న్వల లొగ్గియు జంపి నిల్ల వ్యా
ఘ్రులు దయ లెల్లఁ బో విడచి తోకఫు బీరము లావహింపఁగన్, 59

శా. ఏణం బొక్కటి వ్యాఘ్రులం గడచి తా నిచ్ఛాగతి న్వాయువే
గానం బోరియు నాల్గుపాదముల నేకిన్ భూమిపై నిల్పకన్
తాణ లొప్పెన్ గంగఁ బోవఁగను వీరశ్రేష్ఠుఁడౌ నర్జునుం
డానందంబున నాల్గు గిట్టలను గోత్రం బొప్ప ఖండించియున్.

ఉ. బోయలఁ గాంచి యిటనియె బోయలు మీరు మృగాల నన్ని ప
ట్ట్యాయముగా గ్రహించి యనురాగము మీఱఁగ నాసగర్భ్యుఁడున్
కీయుతుఁడైన ధర్మజ సుధీనిధి ప్రోలను బెట్టి దృష్టి సం
తృప్తయి మృగాలఁ గొట్టితిరి సౌఖ్యము లొందఁ బటంబుఁ జెప్పుఁడీ

వ. అని యానతిచ్చి కృష్ణార్జును లిరువురు న క్కాననంబున విహరించ
నుద్యోగించు నవసరంబున 62

చ. ఒకరఁగ కృష్ణపార్థులు మహోన్నతి రాఁ గని కానసాబ్జనా
స నియతిమొప్ప స్వర్ణమయ చారు వితానము లందురత్నగం

ధనముగఁ దోరణంబులను నవ్యముగాఁగ నలంకరించె నా
వనిఁగళికాంచితంబు లగు వామలత ల్విలసిల్లె నెల్లెడన్. 63

ఉ. అంచిత రామనామ కథనాంక శుకోక్తులచే లతావళీ
చంచల లోచనౌఘము కిసాలపు కెంపుల పల్లెరంబులన్
వంచిత భూమిపుత్త్రికను వామకళా సుమనోనురాగ గా
ధాంచితమై నివాళుల మహోత్సుకంబున నిచ్చె నుద్ధతిన్. 64

సీ. అలివీక్షణంబుల దిలకించెఁ దిలకంబు
పొందుగా నదె సురపొన్న తీగ
ముఖరాగమున హేమ పుష్పకలత పొంగె
సురభిళశ్వాసంబు నెరపె సింధు
కలతిక పికగేయములను బాడె ప్రియాళు
కీరోక్తులను కర్ణికార శాఖ
చూపెను వకుళంబుఁ జూపించె ముఖశీధు
గ్రుచ్చెఁ దావుల నంట గ్రోవి రమ్మ

గీ. తారు చేసెడి రుచిరోపచారముల న
ధిప సురతరుల కామోద దృష్టిఁ బెనుప
నబల లిడు నిత్యకలిత దోహదవిశేష
సరస లాంఛనముల యొక్క సన్నచేత. 65

మ. అను వొప్పం గని పాడి పల్కి నగి తా మాశ్వాసముం జేసి చే
కొని యాలింగన మాస్యమిచ్చి తరులం గొన్నింటి మన్నించి యం
గన లెంత ల్లముఁ జేసి రంచు వకుళౌఘం బాయశోకవ్రజం
బును గృష్ణుం గని మొక్కి గుచ్ఛవినతింబూదేన కన్నీళ్లతోన్

ఉ. శాతము చేత నొక్క నగశాఖను కోకయుగంబు నిల్చి పూ
ర్ణాతత వాక్యవేది కపు డన్యదురాసద మైన యొక్క స
త్త్రీవతి శుభంబు కోమలతఁ దెల్పి నిజోక్తుల నేగ సూర్యపు
త్త్రీ తటినీ తరంగ గణ రేఖల నూగడి నిచ్చ తోడుతన్. 67

క. లోకాద్భుతకర విహగా
లోకామోదంబు వలన లోకాతీతం
బౌ కోక రుతాంచిత మగు
నా కాళిందీ విహార మలరించె వెసన్. 68

ఉ. ఆయెడ సూర్యపుత్రికను నారసి యర్జునుఁ డిట్లు సెప్పు తే
జోయుత పూర్ణకంబుగను జొక్కముగా నల నల్ల మబ్బు లే
మోయనఁగాఁ దరంగములు బుక్కర మంటెడుఁ జూడువాడు చే
చాయనె భంగడోలికల జక్కవ పక్కుల యాట లచ్చటన్. 69

మ. అదికాదే మన నిత్యకేళినది దవ్వా చూత మయ్యేటి సం
పద లంచుం గయిదండఁ బూని యల గోపాలుం గుడాకేశుఁ డా
నదిఁ జేరం జనఁ బల్కుఁ గృష్ణుఁ డచట న్నవ్యామృత స్వాదనో
న్నద రాథాంగ కదంబ కోదిత ఘనానందాత్ముఁడై నెమ్మదిన్. 70

సీ. ఒకచాయ ననపాయ వికిరాయిత నినాద
మొకదారిని శరారి నికర రుతము
నొకవంక మరుదంక సకలంక రుచికంక
ణము పాక్త్రికపు శంక నమలు పరట
లొకచెంత నహికాంతల కరాంత తత నాద
మెంకజోక రుచికోక సకలరుతము

నొక సందునను బంధుర కబంధ భవ బృంద
మధుపాన జనదానమధుప గేయ

గీ. మొక్క మొగి సురద్రు సుమనోవ్యూహవాస
నలను సోఁడు మొట్టఁగ సిస్వనంబు చేత
నగుగు తేఁటుల మొగులని హంస లెల్లఁ
బోవు చుండెడి నీనదిఁ బొగడఁ దరమె. 71

మ. మధుపాస్థాబ్జము మోము సైకతలలామశ్రోణి కోకాళిస
త్పృదువక్షోజయుగంబు నిర్మల ఝరీ హృద్యంబు నూగారు నై
నది రామామృదు చిహ్న నేత్రములకు న్నవ్యస్ఫుటోత్సాహ మి
చ్చె దృఢం బొప్పఁగఁజావ కాంచుఁడన వీక్షించెన్ముదంబారఁ గాన్.

మ. కని పార్థుం గాని తన్నదీపులిన కోకశ్రేష్ఠ మా సింహాసం
హననుం డెక్కె ఝరీ వినిర్గత సమీరారూఢ శాంతంబు వే
గొను నిందూపల రత్నపీఠిక పయిం గో మొప్పఁగా విశ్రమిం
చిన పాంథీష్మ కలారవం బొకటి వచ్చెన్మాధురీ ధుర్యమై. 73

క. మానచర నృదు మధుకర
గానాభీష్టంబుతోడ గ్రందై మృదువై
వీనులవిందై యమృతపు
వానల పొందైన చక్రపాణి వచించెన్. 74

మ. వినదం బొక్కటి పిక్కటిల్లె దెసల న్వింటే గుడాకేశ యా
ధ్వని గీర్వాణవిపంచి శారవమొ షట్పాదీ నినాదంబొ బ
ర్హిణ సంరావమొ పల్లవగ్రసన విజ్ఞాత కాంత పుంస్కోకిల
స : మేమో వివరింప రాదు ఘన హర్షస్ఫీత సంధానమై.

చ. అన విని పార్థుఁ డిట్లనియె నాక నివాసక ముఖ్య వందితాం
ఘ్రినళిన యాలకించి యొక నేరుపు గంటి లసద్విపంచికా
స్వనమునఁ బాడుచుండి రల పంచమ షడ్జ సుశయ్యలం బ్రతి
ధ్వనుల నొసంగుచుండెఁ బ్రమదావుల పైక మయూర వారముల్.

క. నా వుడు వ్వాద్యం బగు నా
రావము చిత్తంబున కనురాగ భరంబుఁ
భావుకము గానొసంగఁగ
గోవిందుఁడు పార్థుఁగాంచి గొబ్బునఁ బల్కెన్. 77

ఉ. ఎవ్వరొ యీ ధునీ దరుల కింపుగ రాగతి మెద్దియో రుచు
ల్నివ్వటిలంగఁ గానుకల లీలలఁ దారటఁ బాడుచుండఁగా
నెవ్వరి యాజ్ఞ యైనదియొ యీ వట కేగియు నన్ని గాంచియున్
జివ్వున వచ్చెదే మనము చేరుద మచ్చటి కొయ్య నెయ్యనన్. 78

చ. అని యనుపం గిరీటి పని యచ్చటి కందర నిర్గతాంక సా
రణముల జాలకం బనకరమ్య సుమాంచిత కుంజ మండలం
బనక దరీపుటం బనక హారి మిళిందలసత్సుమావళీ
కన దగమవ్రజం బనక కాంచుచు నన్నిటి నొక్కచోఁదగన్. 79

సీ. తావులు గుంపులై క్రేవలఁ జల్లెడి
చెంగలువల మళ్ల చెంగట రుచి
గారుడోత్కీర్ణమా కాంత వేది జపాను
బింబితంబై ప్రభ ల్బెంచు చుండ
నీలజాలక జాల నిర్గతాలోకనా
ఖండాగురు విధూప కాంతిఁ బెంప

ముత్యాల తోరణములు రంగవల్లులై

నీలపు మెట్లపై నీను చుండఁ

గీ. జారు చామీకరాంచిత సాలభంజ

కా కరతల లోహితక సంఘాత మరయ

రమ్య నీరాజనోపచారముగ వరల

ననుపమంబైన దివ్యగేహంబుఁ గనిరొ. 80

క. అనుపమ రుచి భిత్తిక ద

ర్పణజప్రతిబింబనముల వరలం గనియున్

వనితారత్న వ్యూహం

బను వొందఁగ మెలఁగు నట్టి వాలిక జనించెన్. 81

చ. తరువుల క్రేవల న్నిలచి ధగ్గజా తన్మూఁడు గాంచె నుజ్జ్వల

త్సరసిజనేత్ర మంజుల శిలాప్రాద విగ్రహ నుల్లసత్తమో

భర పరిభూత సత్కుచ ద్విపారి వలగ్నఁ దలోదరిన్ శర

త్తరుణసుధాంశుఫాల వనితామణి నొక్కతె నాగృహంబునన్ 82

చ. సురభిలతావృతోజ్జ్వల సుశోభన హృద్య శిరోగృహంబునన్

స్వరుధర నీలవేది పయి చారుఘనాంతిక మందుఁ బొల్చు నా

సురుచి తటిల్లతా రుమలఁ జొప్పడి యా చెలియయు విపంచికా

విరమణ వాదనం బెలుల వేడుక రంజిలఁ జేయు మన్నదన్. 83

గీ. కాంచి యనుపమలక్షణకలన లెల్ల

వాత్మ మెచ్చి సంతోషితస్వాంతుఁ డయ్యు

మేఘవాహనపుత్రుండు మీననేత్ర

నింపుమీరంగ నిట్లు వర్ణింపఁ దొడఁగె. 84

సీ. తననిజరూపంబు దగ పునర్భవముల
నిల్పి పుట్టిన రోహిణీలతాంగి
తన మేచకత్వంబు ధమ్మిల్లమందున
దాఁచి పుట్టిన యట్టి దక్షపుత్రి
తనవలక్షత్వంబుఁ దద్దయు హాసంబు
లందు నిల్పి జనించి నట్టివాణి
తనచాపలంబు వీక్షణములఁ జొక్కపు
సిరి మైవహించియుఁ జెలఁగు లచ్చి

గీ. గాఁగఁ దోఁచెడి వారు నీకాంతరూప
గుణకళలను బోధించి యాదవలయేశు
నాశివుని నాజగద్గురు నాముకుందు
వేగఁ దెచ్చెద నని చని విజయుఁ డంత. 85

మ. సరసీతీరమనోజ్ఞపీలు కదళీచాంపేయపూగాలి వి
స్తరపాళీరుచివాసితం బగుచు శంపార్హంబు నా నొక్కనుం
దరకాంతారముఁ గంటి నం దొనర స్వర్ణాంచత్ప్రియం బైనమం
దిరముం జూచితి భావ యారు చిరపుం గేళీనివాసంబునన్. 86

సీ. తతకక్షద్యుతిభోగ ధవళవస్త్రిములోని
పావడ దట్టంపు వన్నెవలనఁ
జంద్రోపలవితర్ధి బాఁపూచినయట్టు
లెఱుపారి దృక్కుల కెరవు నొసఁగ
వెలువగుబ్బలు కక్షసువృత్తి దగవీణ
కాయలనుఁ గనకచ్ఛాయ లొసఁగఁ

గలితాంగుళీదళంబులు సమేళము లైన
తంతుల రాగంపువింత లిడఁగ

గీ. హస్తకంకణధ్వనులు ప్రాణానుబంధ
ము గలతాళగతికనుగ్రహంగతు లీనఁ
చేతనంబు లచేతనభాతి నొనర
వీణవాయించు నొకపికవాణిఁ గంటి. 87

క. సరసిజోదర యాసర
సిరుహాసన లీల లేమి చెప్పుదునుఫణా
ధరవిద్యాధరనరఖే
చరు లైనను దానిఁబోలఁజాలరు చూడన్. 88

గీ. మించులను గొనివచ్చి విరించి నేరె
కోటియసట బొదివి లతాంతేషుతత్త్వ
భావవస్నా బుటములెట్టి రేవెలుంగు
దాగటందు సాగించి యత్తన్విఁ జేసె. 89

సీ. చెలియ నేత్రములు రాజీవంబు లైమించు
నంఘ్రుల్ప్రవాళంబు లై చెలంగుఁ
గలికిజంఘలు భృంగకాహళు లైతోఁచుఁ
గటియంతరీపంపు కలన్ఁబొదలు
లలనబాహులు మృణాళంబులై రంజిల్లు
సతిముఖం బుత్పలహితునిఁ గేరు
కాంతవిగ్రహమిల్లఁ గాంచనం బనఁజెల్లు
రుచిరుచంబులు గుచ్ఛరూఢిఁదనరు

గీ. బిసజముచివుళ్ళు బూరాలు ద్వీపబిసము
లబ్జకలనంబు గాంచనం బరయఁ బుష్ప
గుచ్ఛములఁగూర్చి యీనవకోమలాంగిఁ
జేయు విధిచాతురిని నుతిసేయఁ దరమె. 90

గీ. కలికిజంఘలు గాంగేయకాహళులను
గలమఁగర్భంబులను నినంగముల మకర
సంఘముల గెల్చి యరయంగ సారచారు
తరపు సౌరు వహించె హృద్యంబు గాఁగ. 91

చ. ఒనరఁగ నవ్వధూమణి మృదూరుతలంబులఁ గాంచినాగహ
స్తనివహ మోర్వలేమిని నతత్త్వము చంచల తన్మహాజినం
బును గని లేశమాత్రమును బోలు ననంటిని నేడఁజూచినం
బనివినిదాని దండమునఁ బట్టి పెకల్చెఁ దదీర్ష్య దీరఁగన్. 92

చ. సతికటిమండలం బవనిఁ జక్కఁగ నేలియు నంతరీపసం
తతులను గెల్చి తానరిమదంబును డించియుఁ బూర్ణరాజస
న్మితిని నతిక్రమించి కద మీఱిన యాకరిశీర్షకోపరి
స్థిత యయి తాల్చె మేఖల విదీపిత హాటకపట్టబంధముల్. 93

చ. పొలఁతుక వేణి యన్రుచిరపుచ్ఛముఁ గోఁడ నితాంతమానుచం
బులను భరప్రశుంభములఁ బోల్ప వెలంగఁగ నల్లినారవే
సలలిత మైన తొండమునుఁ జూచి మనోజ మదావళంబు స
త్సలిలముఁ దాఁవు డిగ్గియన సౌరభనాభి వెలంగు నింతికిన్. 94

మ. లలితామోదపయోధరప్రతతి భారంబో ఘనశ్రోణిమం
డలమో భార మటంచుఁ బద్మజుఁడు నూడం జూచి మధ్యంబునం

దల గన్పట్టఁగఁ బట్టుముష్టి యనఁ బాథోజాత నేత్రామణీ
విలసచ్ఛ్రేష్ఠవలగ్న మొప్పు నయనప్రీతిస్ఫుటం బిచ్చుచున్. 95

చ. సరసిజనేత్ర వృత్తఘనచారుపయోధర మండలంబునం
దురుముభరంబు ద్వీపములఁ ద్రోయఁగమించియు నొప్పు చుండు బ
ల్విరుదులమధ్య నాడు నిరుపేదగు కాను విరుంగుళంకచే
సరసిజజాండు గీల్కొలుపు చారుశలాక నారు చెల్వగున్. 96

సీ. అత్యర్థ భిదురప్రహారంబులకుఁ జాలఁ
జలియించు నుత్తాలశైలములును
నగ్నిశిఖావాప్తి నమరద్రుతంబులై
చలియించు గాంగేయకలశములును
దుహినకిరణంబులు దోఁచినయంత నే
ద్రుంకెడి రాజీవకుట్మలములు
విగ్రహస్పర్శచే వేఁడిసొందినశించు
నారయఁ బుష్పగుచ్ఛాళు లెల్ల

గీ. వజ్రహారాన్వితంబులై బాహ్లికాంచి
తంబులై తుషారకసంయుతంబు లైయు
రస్సభాసంస్థితంబులై రమణ మెఱర
సరిగలదె చెలి వలిగుబ్బచన్నుఁగవకు. 97

మ. అసదృతుం బగుశంఖ మొక్కటి విలాసాత్యర్థ గానంబు మా
ససపూర్తిం దగ నేర్పు మంచు సతికంఠావాప్తినిం జెంది లా
లస మొప్పంగను వాత్మవైభవము లెల్లం బూర్తిగానిచ్చి తాఁ
బొసఁగం జాలక పోయె నీచులకు సంపూర్ణత్వము ల్వచ్చునే. 98

సీ. తృణశీలకే గాని సరియౌనె చిగురాకు
వరసుమనోధర్మ మరసియున్న
సొనవన్నెలె కాని సరివచ్చునే కెంపు
వరభూరిమయశేఖ వరలియున్న
నెఱుపువన్నెలె కాని యీడౌనె రక్తక
పుష్పంబు సీధువిన్మూర్తి గనినఁ
జైనవన్నెలె కాని పవడంబు నీడౌనె
యమృతఖనిద్వీపమందు మనిన
గీ. నెన్నిజన్మాంతరము లెత్తి వన్నెమీరి
తపముజేసిన నావనితామణిమృదు
దళనవాసోమృతపుదీవికి సదృశంబె
పలుపలుకులేటికింక గోపాలచంద్ర. 99

మ. సుమనోలీలఁ దిలోత్తమాఖ్య వదలం జూపట్టి యిభ్భూమినే
సుమనోవైఖరిఁ గాంతు నంచుఁ దరులం జోద్యం బధోవక్త్రయై
తమయొప్పంగఁ దపంబుఁ జేసిపతి భాస్వద్ఘ్రాణరూపంబునై
సుమనోవైఖరిఁ గాంచెఁ గ్రేవల నలిస్తోమంబు దగ్గాల్వఁగన్ 100

క. సువుప్రవ్వను సంపెఁగపుం
బువుఁ గలిచియుఁ బిరుదు నూవుఁ బువు గట్టుకొని దా
దివిరి దిరుగు నన ముంగర
లో వనరుహాక్షుణ సునాస తులలే కొప్పన్. 101

సీ. పున్నాగములఁ గేరుఁ బున్నాగముల మీరు
నడకల రుచిరీరు నాభిసారు

కనకంబులను గేరుఁ గనకంబులను మీఱు
తగు వాసయొప్పు మైతావిచొప్పు
సారంగముల నేలు సారంగములఁ దోలు
కందోయియొప్పును గచపుటొప్పు
పంకజంబుల నేఁ బంకజంబులఁ దోలుఁ
గంధరరుచిరంబు కరరమణము

గీ అబ్జమండలముల నేలు నబ్జమండ
లంబు నేలుఁ బదరుచులు లపనరమ్య
మట్టి తన్వినిఁజేయుఁ బ్రహ్మ ప్రభావ
మే మనఁగవచ్చు నతని వర్ణింపఁ దరమె. 102

చ వనజసదృక్షుభూతి హరివైఖరిఁ బొందుముఖస్తనోక్తులున్
వనజసదృక్షుభూతి హరివైఖరిఁ బొందుఁ బదాక్షివేణికల్
వనజసదృక్షుభూతి హరివైఖరి గత్యవలగ్నముల్ దగన్
వనజదళాక్షి సుందరము వారిజనాభ వచింప శక్యమే 108

చ. సురుచిర హాసుధాసరసి శోభనకాండభవాస్య చొక్కఁపు
న్నీరి నిబిడంపుబంతి పృథివీతతసత్కటి చారుపువ్వవ
ల్లరి చిగురాకుబోణి నవలాలితమంజులదృష్టిజాల య
త్తరళవిశాలనేత్ర వనితామణి నీకుఁ దగుం ద్రివిక్రమా. 104

గీ. సరసిజోదర యత్తన్వి సఖులచెల్వ
మలవియే నాకువర్ణింప నలివవలన
గతులు జూపులు నేర్చుకో గదలివచ్చు
నురగరాట్సుతా దేవతాయువతు లొక్కఁ. 105

ఉ. ఆసఖు లెల్లఁ గొల్వఁగను నాసఖి యట్టివనంబునుండు లీ
లాసదనంబులో నవఘనాళితకంఠకభాగ్యము ల్చల
ద్భాసురకోమలాంగుళుల దంభముచేతను నేర్పుతీవి వీ
ణాసరసధ్వను ల్చెనఁప నవ్యములై వినవచ్చె నత్తరిన్. 106

చ. అరయఁగ నంగనాసముదయంబులు ధీరతనున్న చోటికిన్
గరమరుదార లాతిప్రజ గ్రక్కునఁ బోయిన నేని సంశయిం
తు రనియు నేను బోక విపూతనవల్లుల ప్రక్కఁ బొంచి య
త్తరుణివిలాసముం గని గదాధర వచ్చితి నీకుఁ దెల్పఁగన్. 107

చ. అనివిజయుండు దెల్పుటయు నావచనంబులు విన్నఁగాను దా
మును వనిలోనఁ గోకయుగము ల్వచియింపఁగ విన్న సన్నుతా
త్మనఘశుభోక్తి సన్నిహితమై మదికి న్సరిదాఁకి సంతసం
బును బొదలింప నర్జునునిమోదముతో న్బ్రతిఁ జూపు నాపుడున్.

సీ. ఈనగంబులమధ్యఁ దేనెవానలు పెచ్చు
లీనగంబులమధ్య నేగవలయు
నీనికుంజములందు హేరాళము జవాది
యీనికుంజములపై నేగవలయు
నాగతినున్న వజ్రాళిచరులు గాన
నాగతులుప్పొంగ నరుగవలయు
నావంక మహీరాంబు లామూలముగఁ బారు
నీవంకఁ బుడుదోనెఁ బోవవలయు

గీ. పదియె గాంచు కర్పూరపుటనఁటి యిదియె
కుసుమపరాగం బదియె కృష్ణచొక్కపుంబొ

లంతి యిల్లటంచుఁ దెలుపువింత లన్న
సరణి నరుగుచుఁ బాకశాసన సుతుండు. 109

క. విహితప్రసూచితాధ్వక
మహాత్మ్యలక్షణను జూచుమది సుమకళికా
కుహళీచరదళిసుతనూ
రుహనిర్గతగంధవాహరుచి చెలఁగు నని౯. 110

వ కని యాశ్రమం బ్రవేశించి యరుగుచుండు నవసరంబున. 111

శా. ఆలోకాద్భుత మైనయొక్క నవరత్నాష్టాపదాంచద్గృహం
బాలోకించియుఁ గృష్ణుఁడాగృహము డాయంబోయియాప్రాంతతా
లోలద్వల్లుల కేవల న్నిలిచి వ్యాలోలాళిపత్రాసుగా
లోలచ్చారుకిసాలజాలముల నాలోలాంబకం జూచియున్. 112

చ కనుఁగొని కృష్ణుఁడాత్మ నల కంజవిలోచనఁ గూర్చి మెచ్చియుం
గనుగవ కెల్లఁ బూర్ణమగు కౌతుక మొప్పఁగఁ బూర్ణకాముఁడై
మన మతి చిత్రవృత్తినిఁ గ్రమంబునఁ బొందఁగ నిశ్చలుండు నై
వనజముఖిం గనుంగొనుచు వాంఛల మీరుచు నుండు నత్తరి౯ 113

వ. అప్పు డప్రతిమానప్రతాపవైభవుం డగు కపిశేఖరకేతనుండు ఖగశేఖ
రకేతనున కిట్లనియె. 114

మ. అనఘా యేను వచించు వాక్యములు తథ్యం బౌగదా యింక నే
నను వొప్పంగ దపోధవాకృతిని డాయం బోయి పొల్పొంద నా
వనజాక్షీమణి సంగతు ల్గనియు వేఁత్తు న్ననుంగొం టె యో
కనకక్ష్మాధ్రధీర యన్ననిశాఖండానురాగంబున౯. 115

చ. అప్పుడు గిరీటిఁ జూచియను నర్జున యేగతి యోగిరూపముం
గపటతఁ గాంచెదో యెటులఁ గాంతువొ యేకత మందు నున్నయా
చపలవినేత్రిఁ జూచి యెటుచక్కఁగఁ బల్కెదొ యెట్లు మించెదో
గపటతపస్వివై చనుము కార్యవిశారద చూతమియ్యెడన్. 116

వ. అని యంపిన నాక్షణంబున 117

సీ. గాంగేయవల్లిసంఘాతంబు జడగుంపు
బుష్పపరాగంబు భూతి గాఁగ
కాంతపల్లవకోటి కాషాయవస్త్రంబు
దగమనోహరశాఖదండముగను
వల్కల దట్టంబు ప్రబ్బసిగాగను
సరసకింజల్కాళి జపసరంబు
క్షారకవ్రజము మంగళమౌంజి నూలుగా
ఫలరససారంబు పాత్రజలము

గీ. గాఁగ నచ్చటి కల్ప పక్షంబు చేత
నొనర చతురత్వములు మించ నుచిత వేష
మేసి కృష్ణుని నిరపాయహితవిహార
హారిచెలరేగి యొక జడదారియయ్యె. 118

క. సుహితాముని యై జలము
గ్రహానూనుం డక్షసరము గదలింపుచు సం
గ్రహమునసతి హైమాయత
గృహవాటికిఁ బోయెఁ దన్ను గృష్ణుఁడు మెచ్చన్. 119

చ. జపి యటు రాఁ దటాలునను చారుసమున్నత పీఠికావళుల్
ద్విపఘనకుంభయుగ్మనిభ తీవ్రకుచంబులఁ గౌనుదీఁగలం
జపలత లంకురింపఁగ ససంభ్రమచిత్తకృపీటజాతలై
చపలమృగాక్షులైన సతులు చక్కఁగ డిగ్గి రుదంచితోన్నతిన్. 120

చ. డిగివినయమ్ము సంభ్రమము డెందము లందున సందడింపఁగా
మృగనయన ల్హారి న్మణివిపేటిక నిర్మిత పీఠ మొండు ని
ల్పిగడిదిబత్తి సంయమివరేణ్య వరా దయసేయు మంచు వేఁ
డఁగఁ బురుహూతనందనుఁడు లాలిత మొప్పఁగఁ గూరుచున్నెడన్

క. చంచద్ఘనకుచభారా
కుంచితలై నూత్న పుష్ప కోమలు లెల్లన్
వంచి తనూలత లెల్లఘు
నాంచిత చల లట్లు మ్రొక్కి రా యతిమణికిన్. 122

వ. అప్పు డయ్యతి కమనీయాకృతులగు నత్తొయ్యలులం గూడి నె య్యంబునం జేయు ననల్ప వినయోత్పాదనంబుల కుప్పొంగి యో యగణ్యలావణ్యపుణ్యప్రభా సకలవిష్టపోత్కృష్టదక్షుఁడగు శ్రీ క ష్ణుం బెండ్లి యాడు మని దీవించిన సంతోషభరితాత్మలై యయ్య తిపుంజరుని సమ్మతి నాత్మపీఠంబుల నలంకరించి యుండు నవసరంబు న నా రాజీవలోచనయనుంగు చెలులలోఁ జారు వచనచాతురీధురీణ యగు హేమలతహస్తంబులం జోడించి యమ్మునిశిఖామణి కిట్లనియె.

ఉ. ఎచ్చటనుండి యెచ్చటికి నేగుట నిచ్చట కుం దయామతి
న్వచ్చితి రార్యపూజిత భవచ్ఛుచిపన్నఖచంద్రకాంతిచే

నచ్చపుఁ దెల్వి వచ్చె దురితాళి తమోనివహంబు లన్నియు
న్విచ్చె మదాళి వైభవపుఁ బెంపు వచింపఁ దరంబె యేరికిన్. 124

ఉ. అంబుభవాప్త తేజ భవదంఘ్రుల యందున వ్రాలు నట్టి మూ
ర్ధం బది మూర్ధ మెప్పుడును తావక చాటుకథ ల్వచించు భ
వ్యంబగు జిహ్వ జిహ్వ భవదగ్రవిభావన నిర్భరంపు ప్రా
ప్తిం బరిపూర్ణతం జెలఁగు దిష్టము దిష్టము శిష్టకోటికిన్. 125

ఉ. ఓయసమానభావ ఘనయోగికలోకమణీ యనంత తే
జోయుత తావకం బగు విశుద్ధశుభాంకము వేగ దెల్పి సా
ధీయత వార్యసత్కథల తృప్తికిఁ బాల్పడు నాదు కర్ణపా
లీయుగతృప్తిలీలలు ఫలింపఁగఁ జేయఁగదే ముదంబునన్. 126

చ. అన విని మౌనిరాజను మహత్తరమైన ప్రభావయుక్తుఁడై
మునివరసార్వభౌముఁ డయి పొల్పు వహించు నగస్త్యుఁ డన్మహా
ముని యని చెప్పఁగా భువనభూతవిలోచన వింద వే కదా
యనఘుతదన్వవాయ కలశాంబుధిఁ బుట్టితి కౌశికాఖ్యుఁడన్. 127

ఉ. ఓచకితైణమంజువిభవోజ్వల వీక్షణ పిన్ననాట నం
దొచిత భక్తిచేత భువనాళిభయాతిధురీణచాతురీ
శౌచి హరిం భజించియుఁ బ్రశస్త తదీయరహస్యమంత్రలీ
లాచరదాత్మకుండ నయి యాదిమునిస్థితిఁగాంచి తిర్మ్యెడన్. 128

గీ. వనిత విను మేను దగ శైశవంబునుండి
యా మహానుభావుని సేవ లరయ భక్తిఁ
జేయ మది మెచ్చి యొసఁగె నశేషవస్తు
జాలకంబుల నాత్మాను సరణి మహిమ. 129

ఉ. కావున మద్గురుం డిపుడు కౌతుక మొప్పఁగ నీనదీస్ఫుట
జీవనజాత సౌరభముఁ జెందుచు నెమ్మది నున్నవాఁడు స
ద్భావముతోడ నాయన కుపాయన మిచ్చు మనోరథంబుచే
నావల మొప్పఁ జూడఁ గమలావళి వచ్చితి నోసఖీమణీ. 130

క. ఓసరసిజలోచన విను
మీ సారసశాస్త్రవాస్య నీక్షింపంగా
వ్యాసములగు ప్రేమాను
క్రోశంబులు నద్భుతంబు గొనసాగె మదిన్. 131

చ. అసదృశరూపలక్షణసమన్విత యీ వనితాలలామ యీ
కుసుమశరాస రాజ్యరమ గొబ్బున మానసవీధి నెంచియుం
బొసఁగఁగఁ జూడ నద్రిసుత పోలికఁ బోలుచు నుండెనిప్పుడీ
కుసుమసుగంధి భవ్యకులగోత్రములం జెలువారఁ జెప్పుమా. 132

మ. అనిశప్రోషవచోనుభావసముదాయాన్వీతుఁ డావంచనా
ముని యాదృచ్ఛికమైన సూక్తిమది కామోదంబు సంధిల్ల నం
గన లన్యోన్యముఖావలోకనముల స్నానాద్భుతాలీలలం
గని మౌనీంద్రు మహాత్మ్యము ల్పొగడి రగ్రాలాపపుంజంబులన్. 133

వ. అప్పుడు హేమలత వినయమ్మున న మ్మునిరాజుం గాంచి యో య
ప్రతిప్రభావా సకలభువనభారధురాధారేయపరిష్కారాత్మ మహో
గ్రహోజ్జ్వలుం గొల్చి మహత్తరం బైన సుభాగ్యోన్నతిం బొరసి
యున్న మీ కీ సమస్తలోక కథల నెఱింగి యుండుట బ్రహ్మమే యని
క్రమ్మర నత్యంత కుతుకంబున నిట్లనియె. 134

చ. అసదృశరూపలక్షణసమన్విత యీ వనితాలలామ యీ
కుసుమశరాసరాజ్యరమ గొబ్బున మానసవీధి నెంచియుం

బొసఁగఁగఁ జూడ నత్రిసుత పోలికఁ బోలుచు నుండె నంచు వే
గ నెలవోసంగి క్రమ్మరను గానఁగఁ గోయట కూర్మి చేగదా. 135

క. ఓ యతిలోకమణీ వినుఁ
డీ యంగన జన్మవిషయ మిత్తరి నేనున్
మీ యనుకంపాశ్రీవల
నే యెఱిఁగించెద నటంచు నిట్లని పలికెన్. 136

మ. కలఁ డాలోకమహామహోగ్రఘనశక్రజ్వాలికాంశ్వాళిని
ర్గలధారాకృతమేఘపుష్పనిధివారాశిప్రభావాగ్రది
గ్వలభీలోకవితానగుప్తభృశసాముద్ధ్యాంకధారేయపు
ష్కలవర్ధిష్ణునభఃపథుండు వసురాట్కారుణ్య భావుం డొగిన్. 137

వ. అప్పద్మినీవల్లభుం డొక్కనా డుదయశైలంబు నలంకరించి రాఁ బ్ర
యత్నించు నవసరంబున. 138

సీ. సరసామృతంబుల జలకంబులను దేలి
డంబుగ మధుపాంజనంబు నలఁది
మిసిమిగాఁ బుప్పొడి పసుపుఁ బూసియుఁ దేనె
కమనీయముగఁ జిత్రకంబుఁ దీర్చి
రమ్యసత్పత్త్రాంబరంబుల ధరియించి
హంసకాభోగాన నతిశయిల్లి
కాంత కనకవర్ణ కర్ణికలను దాల్చి
కంకణంబులఁ బెట్టి పొంకముగను

గీ. జిరునగవు నెమ్మొగంబునఁ జెంగలింప
నెమ్మి మీఱంగ నతుల భాగ్యమ్ముతోడఁ

బుష్కరద్వారమును వేచి పొల్పువిగాలు
నొక్క పద్మినిఁ జూచె నా ద్యుమణియంత. 139

మ. అతులశ్రీనిధి యవ్విభావసుఁ డమూల్యాకారి యప్పద్మినీ
సతి యొప్పుల్దన కన్నులారఁ గని యిచ్ఛల్మీటి పొంగారి యా
యతచాపల్యము లూరి యుత్కలికలోలాళుల్దిం బొంది యా
తతమారాగధరానఁ బొంగియును జింతాతన్మయత్వంబునన్. 140

వ. అట్టి మదనతాపంబున నాత్మాంశఁ బద్మిని యం దుంచ నబ్బిసినీపు
రంధ్రి గర్భంబుఁ దాల్చి నానాటికి వృద్ధివహించి యొక్క శుభ
ముహూర్తంబున 141

చ. సుకుచిరనవ్యసౌరభవిశుద్ధసమీరణపోతధూతశీ
కరనికరప్రశస్తములు గ్రమ్మెడి చోట పినూత్నహల్లకో
త్కరకరదీపదీప్తితతి గాంచెడిచోటఁ బరాగభూతిచే
నరుదుగ నొప్పుచోట రుచిరాంబుజినీసతి గాంచెఁ బుత్త్రికన్.

గీ. ఆ కృపీటజనీసుత యవతరించు
తరిని జంద్రతారాప్రసాదంబు లెన్న
నలవియే సుముఖతచేత నంఘ్రివైఖ
రులను మించి రంజిల్లె నాయూథి మెఱయ. 143

క. వారాశిపుత్త్రి కైవడి
శ్రీరాజిల వెలయు నీసుశీల యటంచున్
వారిజినీజుఁ గాళిం
దీరమణాఖ్య నిడి రచటి ధీమానీంద్రుల్. 144

చ. జలముల నార్చి శుభ్రవనజచ్ఛదపాళిక గప్పి తమ్మితే
నెలు గడుఁ గూర్మి నుగ్గు లిడి నిర్మలపుం దరగ ల్గదల్చి ను

త్పలసికరంపు టుయ్యేలలఁ దద్దయు నెమ్మిగఁ బెట్టి పుత్రికం
జెలువుగ నూఁచు తేఁటి లలి చెన్నగు పాటల జోలఁ బాడుచున్.

వ. ఇట్లు దినదినప్రవర్ధమానయై సఖులం గూడి గూఢరత్నసికతాన్వేష ణాది క్రీడలం గావింపుచుఁ దల్లిదండ్రుల మనం బుల్లసిల్ల నత్తటిల్ల తాంగి సఖీమండలంబునకు. 146

చ. సురుచిరకల్పకచ్ఛదవిశుద్ధకభాజనమండలంబుల
న్విరినిబిడంబు లోగిరము వెట్టి ఫలప్రకరంబు భక్ష్యము
ల్దరుచుగ నిచ్చి హృద్యరుచిలాలిత మౌ విరిదేనె లాజ్యముం
గరమును బెట్టె నట్టు లగు కల్పమహాత్త్యముచేత నత్తరిన్. 147

ఉ. ఆ తపనాంశు నెమ్మి వెలయంగను గిన్నరకోటి నిల్పియుం
గూఁతుకు న్మనోజ్ఞ మగు కోమల గేయము లెల్ల హృద్యవీ
ణాతతవాద్యభేదముల నవ్యము గాగను నేరుపించి హై
మాతతధామ యొక్కటి బ్రహర్షత నిల్పెను సుందరంబుగన్. 148

క. అత్తరణిజాతయే యా
చిత్తరి యాసుమ నికుంజ బృందంబులు నీ
పుత్త్రడిమేడలు నో ముని
సత్తమ యాసలివిహారసదనము లెలమిన్. 149

క. అని మఱియు హేమలత యి
ట్లనియె న్మానీంద్ర యాశుధాంశుముఖి నభో
మణి యి త్తటినీకూలం
బున నుండుము హరివరించు ముదమున ననఁగాన్. 150

ఉ. చిన్నటనాటనుండియును బ్రేమ దలిర్పఁగ నీ నదీతటా
భిన్నతఁ బొల్చు నా సురభిబృందలసత్సుమమంజుసంజసం
ఛన్నము లైన యీ కనకసద్మము లందున శిల్పి యెప్పుడీ
కన్నెను బ్రోచుచుందుము జగన్నుత భాస్కరు నాజ్ఞ జొప్పునన్

క. అని యిట్లు హేమలత య
వ్వనజానన జన్మకథను వచియింపంగా
విని మెచ్చి గుడాకేశుఁడు
వెనుపొందఁగ సమ్మదాబ్ధి వీచికఁ దేలెన్. 152

మ. లతికాచ్ఛాదితగాత్రుఁడై సతికథాలాపంబు లాలించి యా
యతసంతోషముతోడఁ గృష్ణుఁడు హితాత్యంతోక్తిచాతుర్యమున్
సతివాక్ప్రౌఢిమయున్ స్తనంబుగ మది న్వర్ణించి తద్రూపసం
హృతచిత్తుండయి యాత్మవిత్తముగ నూహించె న్వధూరత్నమున్.

ఉ. కైతవసంయమీశ్వరుఁడు కైతవముద్ర వహించి ధ్యానము
న్నీతిగఁ జేసి నట్లలరి నీరజనేత్రినిఁ జూచి వల్కె న
బ్జాతముఖీ మనస్ఫురిని భావనఁ జేసితి మీసతీమణిం
బ్రీతిగఁ బెండ్లియాడుసుమ కృష్ణుఁడు సిద్ధముగాను నిర్ధరన్. 154

క. రమణీప్రపంచమణి యీ
రమణిన్ సృష్టించు బ్రహ్మరంజచ్చాతు
ర్యము కృష్ణునితోఁ గూర్చిన
రమణ చెలఁగు వసువుఁ గూర్చు రత్నము భంగిన్. 155

చ. నెలఁతలలోన నీ వికచనీరభవాయతనేత్రియుం దగం
బలువిడి పూరుషోత్తమున మన్ననఁ గృష్ణుఁడు గీర్తిఁ గాంతు ర

య్యాలఘుఁడు నీ వధూమణి లతాంతము వాసనయుం బలెం భువిం
గలయుదు రెంతయు న్సతులు గాంతు రభీష్టసుఖప్రపంచములన్. 156

వ. అనిన డెందంబున సందియంబుఁ జెంది యవ్విజితేందిందిరచికుర యయ్యతికుంజరునితో నిట్లనియె 157

ఉ. అయ్య భవద్వచంబు చెలువారఁగ నప్రతిమై సెలంగు నా
కయ్యలఘుప్రభావుఁ డిట కారయ నెట్టుల వచ్చు వచ్చి తా
నెయ్యన నీ నదీదరుల నెప్పగ నెట్టులఁ జూడ వచ్చు ని
త్తొయ్యలి నెట్లు చూచు నని తోఁచెడి సంశయ మాత్మలోపలన్.

చ. అన విని మౌనిరా జను సహస్రదళేక్షణ నీకు నియ్యెడ
న్మనమున సంశయం బొదవిన న్విను నాదు ప్రభావధీరతం
ఘనుఁ డగు కృష్ణు నిచ్చటనె కానఁగఁ జేసెదఁ జూడు మంచుఁ దా
నొనరఁగ వానిఁ గూర్చి యొక యుక్తి వచింపఁగ న తఁడత్తరిన్.

మ. ఇదియే చేరెడి వేళ యంచుఁ దగ శ్రీకృష్ణుండు నీరంధ్రనీ
రదనేపథ్యవినిర్గతుం డయిన తారానాథు లీల న్లతా
చ్ఛదసంఛాదికఁ బాసి నిల్చె నెదుటన్ సారంగ రాగోల్లస
న్మధులిణ్మండలవందిమాగధరుతీమాధుర్యముం దెల్పఁగన్. 160

సీ. తరుణవయసు వాని శరజాత శరభూతి
శరజాతుఁ దెగడు సుందరము వాని
మొగులుచాయల వాని పగడంబు జిగిడంబు
జగడంబుగలుగునోష్ఠంబు వాని
కలికిచూపుల వాని వెలిదమ్మి వెలిఁ జిమ్మి
వెలిగ్రమ్ము నేత్రము ల్వెలుఁగువాని

నిగనిగ ల్గల వాని నెల చెన్ను జిగి వన్నె
సరి యెన్నఁ జెలఁగు హాసంబు వాని

గీ. కటకకుండలకేయూరకాంతమకుట
హారకంకణచారుచక్యముల వానిఁ
గృష్ణుఁ గనుఁ గొని యచటి పంకేజనయన
లందఱును లేచి రతి వినయంబుఁ దోప. 161

మ. చెలఁగం గృష్ణుఁడు సంతసంబు మది వే చేరంగ వీక్షించి య
చ్చెలి వాంఛాఫలసిద్ధిర స్తనుచుఁ దాఁ జెన్నొందఁ దీవించ పే
శలస స్మేరముఖారవిందుఁ డగుచున్ శ్యామావితానార్పితో
జ్జ్వలజాంబూనదపీఠిఁ బొల్చె సరసీజప్రోజ్జ్వలద్ధంసనాన్. 162

చ. అసదృశరూపు గృష్ణుఁ గను నా శతపత్రదళాక్షి కప్డు మా
నసమున రాగకందళము నాటుకొనంగను రోమహర్షణం
బొసఁగఁగఁ గాత్రవల్లికి మహోన్నతి చాపలము ల్సెలంగఁగా
నెసఁగుచు నల్ల నల్లఁ జనె నీక్షణపఙ్క్తులు తేటి చాలు నాన్.

క. కాళింది చూపు లల గో
పాలుం బొదలుచును వేగ పైపయిఁ జనుచు
న్నాళీకానుగచిత్రశ
రాళులుగాఁ బరగె నప్పు డారయ నెమ్మిన్. 164

క. ఆ కంజనయన హృదయం
బా కృష్ణుని తలఁపు వేగ నారసి రుచిరా
నూకవచనరచనావి
శేషకాంతత పేమవల్లి యిట్లని పల్కెన్. 165

సీ. కువలయాధీశ్వర కొమరొందు నక్షీణ
పర్వంబు నీరాక పదిల పరచె
లోకైకమిత్ర మీ రాక మాతమ మంత
నెడలించి తెలివికి నీడు వడియె
కాంచనాచలధీర కమనీయ సౌమన
స్యంబు లొసఁగె నీ పదాప్తి మాకు
శ్రీద మీరాక మా కాదరంబున నభీ
ష్టశుభంబు లొసఁగెడి సన్నుతింప
గీ. నేము విదళచ్చరితు నిన్ను నిచ్చట భజి
యింపఁగా మాసతీరాగ మింక సఫలి
తాకలితమై వెలసెఁ గానఁ దరమె విధికి
లలిత మై యొప్పు చిరభాగ్యలక్ష్మిఁ బొగడ. 166

చ. అన హరి యిట్లు పల్కు- వనితా వినుతాతిశయద్ధి మండలుం
డెనయఁగ నీమహాత్మ్య నుతియింపఁ దరంబె సురూపభూష మీ
యనుఁగు చెలిం గనుంగొను ప్రహర్షము వేగనె కూర్చె మాకు నీ
ముని యరయంగ నాప్తజనముఖ్యుఁడు గాని మునీంద్రమాత్రుఁడే.

వ. మరియు నితని మంత్రిప్రభావంబున భవాదృశప్రమదా మధుమ
ధురాలాపంబు లాలింపఁగలిగె ననిన విని సంతసంబునం గొంత తడ
వ కైకృతవ సంయమీశ్వరుం డక్కృష్ణుని వినయాలాపంబులఁ జిం
తించి క్రమ్మర నమ్మగువ నెమ్మొగమ్ము వీక్షించి కలకంఠకంఠీ యనుపం
తిత లోకనిర్మాణచాతురీధురీణుం డగు హిరణ్యగర్భుం డే తాదృశ
ప్రశస్తవస్తుయుగళయోజనంబున నుతిభాజనుం డయ్యెఁ జుమీ
యింతియె కాక తద్విషయం బైన శుభసూచకంబులఁ గాంచితివి

కదా యింక సందేహంబు వలదని వీడ్కొలిపి యాకృష్ణునకు నా
శంపాలతాంగికిఁ గళ్యాణకౌతుకసమృద్ధి యగుఁగాకని దీవించి వారి
యాదరణంబు వలనఁ గాంచన మందిరంబు వెల్వడి చని కతిపయ
దూరంబున నీరంధ్రంబు లైన హరిచందనభూరుహంబుల యారంబు
లలో ఋష్యాకారంబు డించి యథాపూర్వక మైన వేషంబుతోఁ
గృష్ణు నన్వేషించు మార్గంబున నేతెంచి యతని ప్రక్కను నిల్చి
యుండు నవసరంబున. 168

ఉ. గన్యతఁ జేరి యా చెలులు కైతవవేషుని వానిఁ జూచి య
న్యోన్యముఖావలోకనము లందియు నద్భుత మొంది యప్పుడా
జన్యుని చాతురీసుగుణసంచయము ల్నిపుణత్వ మట్టి సౌ
జన్యత వాత్మ మెచ్చి నుతి సల్పిరి వాగ్ఘననైపుణంబులన్. 169

చ. అపు డొక బాల మేలమున నా చెలిఁ గాంచి వయస్యలార యీ
తపనసుపుత్రికాననముఁ దాల్చె వికాసము కృష్ణురాకచే
నిపు డతి కౌతుకాన నన నింతి ముఖం బెదఁ జేర్చి వానినే
యపరిమితోత్సుకానఁ గనె నంతకుచార్పితహారధారలోన్. 170

చ. అది కని యొక్క బాల సతులార ముదంబున నీ వధూమణి
సదమలపీవరస్తన సశస్త్రవిభూషితహారధార శా
రదరుచిగంటిరే యనఁగ రమ్యమదోద్యదళిప్రవేణి స
న్మృదుసుమగాత్రియంత తెరమీఁదటి వైపున కేగుఁ గిన్కతోన్.

క. ఈరీతినిఁ గామిని ప్రతి
సీరాంతికమునకు నేగఁ జెలు వొప్పంగన్

వారిజనేత్రుండు దనివి
దీరని చూడ్కులను జూచి ధృతి బోవంగన్. 172

చ. తరిఁ జెలువొందఁ గప్పు జలదమ్ములఁ గ్రమ్మి తెరట్టు లారయ
న్నెఱ గొనరంగఁ బూర్ణమగు మేచకకాంతి వహించి యుండి క్రి
క్కిఱియుచుఁ గొప్ప తన్నులమి క్రేవలఁ జల్లుచు నుండ లేదె యి
త్తెరవల కాండపట్టమును దెంపునఁ జేర ననంగ గాంతయున్.

గీ. నెయ్యమునఁ జేరి యప్పుడ నీలవేణిఁ
గాంచి యిట్లనె నోచెలి కౌతుకాప్తి
నాథు వీక్షించి తెరచాటునకుఁ జనంగఁ
జూపరకుఁ దోఁచె నుపయమస్ఫూర్తి యనుడు. 174

ఉ. విని చెలి ఘోషఁ జేయు సఖి వీక్షణజేసి యదల్చి చిత్తమం
దునను మహామనోజ్ఞగతి దోడుగ నీ వనజాతమందు ఖే
లనముల కెల్లఁ దానయి చెలంగుచు నుండిన హంసవాణి తా
ననువుగ రాదొకో యిచటికంచుఁ దలంచుచు నుండు నత్తరిన్.

గీ. హంసవాణి యేతెంచి యయ్యతివఁ గాంచి
ముద్దరాల మీతండ్రి సమ్మోదమలరఁ
గుసుమముల నిచ్చి వేడుక బొసఁగ నిన్ను
దెమ్మనుచుఁ బల్కె నింక నీవు రమ్మనుటయు. 176

క. కుచభారంబున వడకుచుఁ
గచబంధము నుండి విరులు ఘల్లున రాలన్
రుచిపదకటక ఝణంఝణ
సచలత్కారంబు లెసఁగఁ జనఁ దివురుటయున్ 177

ఉ. నెయ్యముతోడ హేమలత నీరభవేక్షణ చెయ్యిపట్టి సా
హాయ్యత నో వధూమణి మహామతి యీపురుషోత్తముండు సం
ధాయ్యత నీదు పొందు మదిఁ దథ్యముగాఁగను గోరి వచ్చె నీ
వియ్యెడ వాని నేమరచి యేగుట పాడియె నాఁగ నెచ్చెలిన్. 178

ఉ. నెచ్చెలితోడఁ దీసికొని నెమ్మది నేగఁగఁ దోడి చేడియల్
చెచ్చెర నచ్చెలిం గదిసి చేడియ భావివియోగచింత ని
న్నొచ్చములేకఁ బొందఁగను నోర్చెదవే యని కృష్ణుఁ జూచి మా
నెచ్చెలి మీఁదఁ బ్రేమను వినిశ్చలవృత్తిని నుంచుఁడీ మదిన్. 179

వ. అని చెప్పి యవ్వరారోహ నత్తొయ్యలులు తల్లి విజనప్రదేశంబున
కుం దోడ్కొని పోవుచుండు నవసరంబున. 180

క. రామామణి చను మార్గము
రామామదనుఁడు మనోనురాగముతోడన్
వేమరు నిగిడ్చె మధుప
స్తోమపుఁ జాలనఁగ నొప్పు జూడ్కుల నెల్లన్. 181

చ. వనవిటపీలతాకుసుమవాసన లొల్లక భామినీమణీ
ఘననిభవేణికాకలిత కాంతసువాసన నిచ్చగించియున్
వెను దగిలె న్మధువ్రతనిపేటికము ల్వెరిమంపు సెంపుచేఁ
గని నిగుడించు జాంబవతి కాంతుని చూపుల ప్రోవులో యనన్.

చ. నడకల సౌరు హంసలకు నాట్యవిజృంభణ బర్హిణాళికిం
గడువడి నేర్పుచు న్వరలి కాంతునిఁ జూచె లతాంగి వక్త్రచం
ద్రుఁడు వడి వచ్చె నంచుఁ దమిఁ గోరపు కొండల దాఁగ నాఁగ నా
జడ ఘనమైన యట్టి వలిజన్నులపై నసియాడుచుండఁగన్. 188

వ. ఇట్లక్కన్య తన మనంబులను మఱుంగువడు నవసరంబున 184

ఉ. కంజములుం గిసాలములుఁ గాంతసుసౌరభపుష్పగుచ్ఛము
ల్మంజులమా వనంటి నిబిడంబులు నూత్నలతావితానము
ల్రంజితమైన పుష్పాదులరాసులఁ జూచి భ్రమించు నాశర
త్కంజదళేక్షణావయవతండములం ఘనసందియంబుచే. 185

సీ. ఇట కిసలయజాల మినుమడించెను సతి
కమనీయపాదాప్తిఁ గాఁగఁ దోఁచె
నిటఁ బుష్పజాతులు పటుతరంబుగఁ బూచెఁ
గన్నె నవ్విన చాయఁ గాఁగఁ దోఁచె
నిచటఁ దేనియవంక లినుమడించెను జాల
కాంత పల్కిన చాయఁ గాఁగఁ దోఁచె
నిచట భృంగికుతు లెనసి యుండెను జూడఁ
గలికి మాటిన వనిగాఁగఁ దోఁచెఁ

గీ. జూచితె సఖా యని యశోక శుచి నమేరు
కర్ణికారాళి తిలకనికర లతా వి
తానములఁ బొల్చుఁ గాన మార్గాన సరసి
యరసి చెలిఁ గానక భ్రమించుఁ గరముఁ దమ్మిని. 186

వ. ఇట్లు సంభ్రమించుచు కృష్ణుని విజయుండు నిజారామవాటికిం దో
డ్కొనివచ్చి చంద్రశాలం బ్రవేశించి యందుండు పరిమళమిళి
తపుష్పశయ్య నొయ్యన మేను దార్చి యచ్చెలిం గూర్చి ప్రసం
గించుచుండె నని కామహర్షణి శౌనకాదిమహామునులకుం జెప్పిన
వార లవ్వలి కథావిధానం బడుగుటయు 187

శా. నిస్తంద్రస్ఫుటధీర ధీరవినుతో న్నీల ద్యశోభామినీ
హస్తాగ్రామలకాయమాన మహనీయార్జోజజాండా విభూ
త్యస్తోకోజ్జ్వల దానకంకణ లసద్ధస్తాగ్ర రూపోల్లస
ద్విస్తారావమతాత్మజా ఘనసుధీదేవద్రుమా విక్రమా 188

క. శంబరరుహనయనా నవ
శంబగజేషరిపుశైల శంబా సుయశో
డంబర పరిభూతి విలస
దంబరలహరీ సుదాన హరివరపుత్రా. 189

మాలినీవృత్తము.

వినుతసుగుణధుర్యా విశ్రుతాశాంతకీర్తీ
వనజనయన పాదాబ్జాతమత్తాలిచిత్తా
వనసుగుణవిహారా వైరివల్లి ప్రహారా
కనకమణిసుభూషాగ్రప్రథీ నాగభూషా. 1'0

## గద్య

ఇది శ్రీమద్రామచంద్ర పాదారవింద వందన జగత్ప్రాణ నందన ప్రసాదాసాదితకవితానిర్వాహక ధూళిపాళ సూర్యనారాయణ తనూభవ సకలసుకవిజనవిధేయ వేంకటరామనామధేయ విరచితంబైన కాళిందీపరిణయంబను మహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

శ్రీ. శ్రీ. శ్రీ.

---

శ్రీ

# కాళిందీపరిణయము

## తృతీయాశ్వాసము.



క. శ్రీకర బండారి సువం
శాకూపార రజనీసహాయ దిగంతా
లోకప్రశస్త కీర్త్యై
స్తోకవిభవ నాగభూప శోభనవేషా. 1

వ. అవధరింపుము రోమహర్షణి శౌనకాది మహామునుల కిట్లను నట్లు బాలామనోభవుం డగు కృష్ణుం డఖండ పుండ్రేక్షు కోదండ కాండ ప్రకాండంబులు డెందంబు సందడింప డోలాయమానమానసుండై యుండె నంత నచ్చట. 2

శా. ఆరామామణి కామహాస్త్ర విలసజ్జ్యాముక్త చూతాస్త్రసం
భీరాత్త్వ్యాహతిఁ గోఁడి తద్భటులకుం భీతిల్లి జాంబూనదా
గారం బుద్ధతిఁ జేరి సెజ్జొకటిఁ గాఁకుం దాన్ వీక్షించి యం
దారూఢిన్ శయనించి తాపము వహించెఁ జైత్రుఁ బ్రార్థనన్. 3

ఉ. అంచలు చేరఁగా బెదరి యాచెలి గిన్కను జూచు కీరముల్
జంచలవృత్తిఁ గూయ మది సంచలనంబు వహించి దిక్కులన్
జంచలతం గనుంగొనును సద్ద్విజపుష్కలమండలంబు నా
చంచలచంచరీకములఁ జంపఁగఁ జూచు మనోజవేదనన్. 4

గీ. కలికి యలి కీరమండలి కలికి కలికి
పూములుకు లేయు చావంచ ములుకులదొర
నాడరాని గెంటసముల నాడి కృష్ణు
దలఁచి తనలోన నిట్లని పలికె నలికి. 5

ఉ. అద్దిర వాని సోయగ మహస్కరమిత్రుని యక్షరాట్సుతుం
దద్దయు గెల్వఁ జాలు నలితండము బమ్మెర వోవఁ దోలు నా
నిద్దపు సోగ వెండ్రుకలు నిర్జరనాథుని హస్తిహస్తముం
గ్రద్దరికించు బాహువులు కన్నులు పంకజపత్త్రజైత్రముల్. 6

ఉ. అమ్మక చెల్ల వానికిఁక నమ్మక చెల్లను నాదు దేహ మా
కమ్మనివిల్తు బారికి పికావికలై లలిఁ బోవ కుండునే
కమ్మని కుందనంబు గసుగందెడి వాదగు మేను సింహము
ధ్యమ్ము దిరస్కరించు నడు మా సొగ సెప్పుడు చూతునో యనున్

శా. తల్లిం దండ్రియు నల్ల మొల్లసిలఁగా దర్శంబులం దీర్చఁగాఁ
గల్లోలంబుల నొందు దేవనరలోకస్త్రీలలో నొక్క సం
ఫుల్లాబ్జేక్షణయై జనింపక జడాత్ముండైన నీయద్రికి
న్వెల్లిం బుట్టిన తల్లికిం బొడమి వే నేబొందితి న్వీరడిన్. 8

సీ. ప్రవిలాసమున వీణె వాయింపఁ గూహానాము
నీశ్వరుఁ డచ్చటి కేలవచ్చె
వచ్చిన నేమి యావామామనోభవు
నాతతరూపు నేలా తలంచెఁ
దలఁచిన నేమి కైతవజపప్రౌఢిఁదాఁ
బ్రియుఁ గూరి నేలరప్పించి చూపెఁ

జూపిన నేమి యా సుందరాంగునిఁ జూచి
నెమ్మిచే భ్రాంతిఁ బొందితి నిదేల

గీ. మదనుఁ డిపు డేచ సాగను మత్తమధుప
బర్హిణాశుక పికంబులఁ బరపి వేగ
ననుచుఁ దనలో వితర్కించుకొనుచు నన్ని
వనికి నేఁగఁగఁ జక్కనా ననుచు నంత. 9

క. పరమాణుమధ్య యాగతి
విరిసెజ్జను డిగ్గి తురము విడబడి చెదరం
బరువడి ముడువక నావని
సరణిం జనుచుండ మధ్య సరణిన్ రమణిన్. 10

సీ. శాఖాస్థితంబులై చంద్రకంబులు బమ్మ
రాకాసులట్టుల ఢాకఁ జూప
మధుపానమత్తమై మత్తాలి గణము తు
పాకిగుండ్లట్టులఁ దాకి చూపఁ
బల్లవార్చితో పొందుఁ బచరించి పైకంబు,
కనుల మంటలు రాలఁ గాంచు చుండ
ఫలభంగములు సేసి ప్రబలుచుండు శుకంబు
బింబోష్ఠము హరింప బెనకుచుండ

గీ. సరణి నిట్టుల వికసిత జలజనేత్రి
శరచరపతాకదృఢధాటి కరము నేచఁ
బయిఁ దరము దోఁచఁ బుప్పొడి పాదములకు
కలసి సొలసి విరక్తి లతాంగి యంత. 11

క. సకియ కనుమొఱఁగి యా పొలఁ
తుక యారామస్థలంబు దొరకొని కుసుమాం
బకధాటీ పికవందీ
నికరాటీకనము మనము నివ్వెఱఁ బఱపన్. 12

సీ. మలయానిలాహతా వలమాన కైరవ
చ్యవమాన రజముమై నలదఁ దివురు
మదనానలప్రభా సదనా మ్రకోమల
కిసలార్చిపైఁ జూపు గెరలఁ జూపు
కరవారిజాతాగ్ర సరసీజసీధు ర
సావాప్తిఁ గన్నీరు నణఁచఁ గోరు
గొజ్జంగి పువ్వుల సజ్జకం బగుచును
దొరగి పారెడి వాక నురుకఁ గోరు

గీ. కుంజగణ గుంజ దళిజాల మంజురవము
వెగటుగాఁ దోఁచఁ జెవి యొగ్గి వినఁ గడంగు
కోరకేమియు సహకార కోరకమ్ము
నూరుకొని వడి నిగుడంగ నూహఁ జేసె. 18

ఉ. ఆతఱి సుందరి న్మణిగృహంబునఁ గానక తోడి నెచ్చెలుల్
చేతమునందుఁ దత్తరముఁ జెందియు నెచ్చటి కేగెనో కడున్
భీతమృగాక్షి యంచు సతి భీత వనంబులఁ జూచి యొక్కచో
నాతతదర్పకేషు హతి నాను పొలంతుకఁ జూచి సంభ్రమన్. . 14

మ. అకటా మమ్ము నిమేష మైన వదలన్ హర్షించ నీ వెట్టు లీ
ప్రకటం బౌ వనిఁ జొచ్చి తమ్మ సరణిన్ రంజిల్లు నీ శీధు దీ

ఘ్రికఁ జేలావడి నీది తమ్మ యగయం గ్రీడావనీ సత్సరి
న్నికటాధ్వప్రపరాగఘాతములకు న్నీపాద మెట్లోర్చునే. 15

చ. మది సహితంబునన్ హితము మార్పని బేలవు కాన నేటికిన్
గదిసియు వచ్చితమ్మ వనిఁ గాచెడి మత్త మధువ్రతావళుల్
బొదలుచుఁ బల్లవోత్కరము బొంగుచుఁ బాంశులపంకజావళుల్
బదపడి నిచ్చటం బథిక వర్గము నొంటిఁ జరింప నిచ్చునే. 16

వ. అని యట్లమ్ముద్దియలు దూరి. 17

చ. వనితకు బుద్ధి జెప్పి శుచి వారిజభాజనరాజి నావటిం
చిన ప్రసవాన్నరాశిపయి చెందొగ యొక్కటి నిల్పి నెచ్చెలున్
బనివడి చుట్టు రా దిగిచి వైచి ఫలాశగణస్థితంబులా
యనరు ననంగు బంటులకు నా మెత వెట్టి రనేక భంగులన్. 18

క. ఆవేళ హేమలత యా
భావజు పటుధాటి హృదయవనజాతంబుం
జేవ యొసఁగ భేదింపఁగ
నావిలపడు నట్టి సతికి ననియెం బ్రీతిన్. 19

గీ. కలికి మధుప శుకాళికి నలికి పలుక
వేల యీవేళ నో బాల గోలవు బలె
నీదు మధుమధురోక్తుల నాదరించి
జాలిఁ బడె సుమ్ము యివి యీ నగాళిఁ బడియె. 20

చ. నిరతము నిష్టతోడను వనీనికరంబులఁ జేరియచ్చటం
దరుల నధోముఖంబుగను డద్దరొం నిల్చియు రామరామ యం

చరయఁ దపంబు సల్పెడి శుకాళులు నీ కెటు సేగి సేయునో
సరసిరుహాయతేక్షణ విచారము మానుము మానసంబునన్. 21

సీ. సర్వలతాంతవాసనలు గాంచి విముక్త
కనకంబులగు మాధుకరకులంబు
పల్లవకోటిని భక్షించి మాధవా
ర్చితసూక్తి మనుచుండు పికచయంబు
పద్మపీఠాభ్యాస పరవశంబున బ్రహ్మ
వశమానసములైన వరసుహంస
లురగహారంబుల నొనరఁ బరబ్రహ్మ
గతులైన ఘననీలకంఠవితతు

గీ. లెసఁగఁ బుష్పకిసలఘనరసజపీత
సర్వహారంబులఁ దపంబు సల్పునట్టి
భ్రమర పిక హంస బర్హిణవార మేల
సేగి సేయు నావంతను జెలియ విడువు. 22

ఉ. కైరవపంకజంబులకు కంజహితాబ్జవిరోధ మంచునున్
సారము లేని మందగతి నాలియు గాడ్పునకున్ హరిగ్రహా
క్రూర విఘాత మ్మాత్మజునకుం దులఁ గానని భీమవీక్షణాం
గారక వైర మింత జలుకం దగ దంగజు ధాటి కింతయున్. 23

వ. అని యిట్లనేకప్రకారంబుల నవ్వారారోహకు భయంబు వాపి తోడి
చెలికత్తెయైన హేమలత యచ్చెలిం గూడుకొని. 24

ఉ. నమ్మికతోడఁ గొమ్మ వదనమ్మికఁ జిమ్మక నెత్తవమ్మ మా
యమ్మ మనోరథమ్ము చెలువారఁగఁ గమ్మనివిల్తు చారువా

దమ్ములు బత్తి గ్రమ్మి విరిదమ్ములఁ జేర్చి భజింతు మమ్మరో
రమ్మని కొమ్మ భామిని కరమ్మనివార్యగతిం దెమల్పఁగన్. 25

క. సోలుచుఁ జింతాజలనిధిఁ
దేలుచుఁ గైదండయొసఁగు దెరవ యొడలిపై
వ్రాలుచుఁ దాపంబున వడిఁ
దూలుచుఁ దెగడుచును జెలులఁ దొయ్యలి నడిచెన్. 26

సీ. మైనిండ నలఁదిన మదసాంకవామోద
ముకుళవ్రజంబుల మూల కొత్త
సాంద్రదుస్సహదీర్ఘనిశ్శ్వాసవాయువు
వచ్చు తేఁటుల బరాబరులు సేయఁ
ప్రజ్వలితాత్మ తాపజ్వాలికావళి
కిసలయంబుల పైకిఁ గెరలుచుండ
రమ్యవక్త్రేందుసాంద్రరుచిపాండుచ్ఛాయ
పంకజావళి యడావడి యడంప

గీ. మెసఁగఁ గీరజాతములను భసలములను
కిసలయములను వనజాత విసరములను
నణఁచ విరహంబ తోడుగా నపుడు నాతి
వెడలె మంజులతారామ వీథులకును. 27

క. రామానివహం బా యా
రామతలమున సుమగణముల రకములు కలకం
ఠీమంజునాదకుఁ దెలిపి
సామతఁ దత్కేలనఁ బొద్దు జరుపుద మనుచున్. 28

మ. ధవళాక్షేక్షణ పొంచి చూడు మవిగో దట్టంపుగ్రొమ్మావికెం
జివురుం జొంపములోననున్నవి రుచిశ్రీమల్లికాగుచ్ఛముల్
భవదీయాగ్నిశిఖాన్వితస్తనయుగీభాసంప్రతారూఢపా
టవముం బొందినవై రహస్యమగు చోటం డాగు చందంబునన్.

మ. అలినీలాలక నీదు పల్కులను దా నాలించి దాడింబయం
టులగీరంబులు నానఁ జేరి ఫలసందోహంబునం దొప్పగం
దలక్రిందై తప మట్లు సేయఁ దొడఁగెం దథ్యంబ వీక్షించితే
తలపన్ యోగ్యవచంబు లబ్బునె భువిం దౌర్జన్యబింబాసికిన్. 30

క. కాననమునఁ జిరకాలము
మౌని యగుచు వాక్యసిద్ధి మాధవువలనం
దానరసి పికకవి పలుకుఁ
దేనె యొలుకు పంచమశ్రుతిం జెలి వింటే. 31

చ. కనుఁగొనఁ బోడఁ బల్కనగఁ గాలునఁదన్న ముఖంబు నెత్త నూ
ద నెదను జేర్చఁ బట్టఁగను దాఁకఁగఁ జాలవు గాని కాకచే
ఘనకచ పూవు లీవె తిలకంబుఁ బ్రియాళువుఁ గర్ణికారముం
జనువనమేరు కేసరము చంపక సింధుక పీలు చూతముల్. 32

క. అని యిట్లా పొలఁతుక క
వ్వని వైభవ మెల్లఁ దెలిపి వనజాతముఖుల్
జనుకట్లు గట్టి యొద్దిక
ననువున జడలల్లి కుసుమహరణోత్సుకలై. 33

సీ. సారసముఖి యోర్తు సహకారకుజనంబు
పొలఁతుక యొక్కతె తిలకతరువు

రామామణి యొకర్తు హేమపుష్పకమును
గోమలి యొక్కతె క్రోవిరెమ్మ
సుందరి యొకతె యశోకవృక్షంబును
బువుఁబోఁడి యొక్కతె పొన్నచెట్టు
సుందరాంగి యొకర్తు సింధువారంబును
వనజాస్య యొక్కతె వకుళవృక్ష

గీ. మొరసి చేకొని కాంచి ముద్దరసి కౌఁగ
లించి తన్ని నగియు నూది నించియుముఖ
శీధువును మొల్క లెత్తించి చేరిచెలులు
నొండొరుల మీఁదఁ బంతంబు మెండుకొనఁగ. 34

గీ. చిగురు వాలును జిగిడంబుఁ జెరుకువిల్లు
నలరుదూపులుఁ బూని శుకాళి లోనఁ
దూరియునుఁ దాను జిత్తజాతుండ నంచు
సతులఁ బెదరించె నొక ఫుల్లజలరుహాస్య. 35

చ. అది యొక బాల కాంచి చెలువారఁ గురుల్జడ లల్లిబూదిపై
బదిలముఁగాను బూసి సురపాదప పుష్పములెట్టు కుత్తుకం
గదిసి కనుంగొనంగ మృగనాభిక సంజను వేఁడ్కఁ దీర్చితా
మదన విరోధి నంచుఁ దగ మార్కొని దాని నదల్చె గ్రక్కున౯.

చ. అరయఁగఁ గేళిఁ జేసియు లతాంగు లతాంత లతాంత కావలిన్
మిరుఁదనుషంగ సౌఖ్యమున మంజుల వాసనఁ బోని తేనియల్
బొరలని యా పరాగములుఁ బోవని మత్తమిళిందమండలం
బరయని పుష్పము ల్గనసి జార్చనకుం దగ సంగ్రహించుచున్. 37

సీ. సుమవాసనాజాల మమరఁ జిమ్మితి మింక
పరచు టామని యెంత పదరి పడునొ
ఫలతండముల నెల్ల దులిచి వైచితి మింక
పగర కీర మదెంత పదరిపడునొ
కిసలయంబుల నెల్లఁ గసిమిఁ జేసితిమింక
దురుసు కోయి లదెంత దుడుకుఁ గనునొ
విరుల తేనియ లెల్లఁ బొరలఁ ద్రోచితిమింక
బేరల్కు నళు లెంత వెగటుఁ గనునొ

గీ. తెలియరా దింతులార యీ తెరవ నిచట
మసలఁగా నీకఁ గొనిరందు మనముఁ గొనిన
కుసుమ ఫల నవకిసలయ ప్రసవరసము
లసమబాణున కర్పింత మనుచు వెడలి 38

క. గంధప్రసూనకుమాళీ
కందళితమధుప్రసంగక మిళిందవధూ
బృందప్రనందితం బగు
మందపవన మొలయ విజిత మార్గశ్రములై. 39

క. నీరజనయనలుఁ గాంచిరి
నీరజశరహోమకుండనిభమంజులస
న్నీరజగతాళిధూమము
నీరజనిధి నొక సరస్సు నెమ్మి వెలయఁగాన్ 40

వ. కని యక్కమలాకరంబు పొంత మెలంగు వన దేవతలు నిజ విచిత్ర
పత్ర లతాజాలకాలోకంబు లాలోకింపం గోరి పద్మాకర దర్పణంబు

బలుమారు మెఱుంగిడ బ్రేవల వాల్గిలు రావ్రుడి కైవడి వలయాకార తీర సంరూఢ తరు విసర కుసుమ పరిపతిత పరాగ పటలంబుల వ్యాపించు శృంగారంబున కచ్చెరు వందుచు మంజు లారామ విహార పరితాంత లగు తమ కనుభవయోగ్యంబుగాఁ జారువినమ్ర శాఖాంచల కిసాలయ తాళవృంతంబులచే విసరివిసరి కోమల మారుత వలన గళిత సుమసముదయంబుల వాసనా యుక్తంబులుగాఁ జేసి కాసార వారి పూరంబు నతి నీహారంబుగను నపారసౌరభోదారం బునుగాఁ జేయు తుషార కిరణ శిలాఫలక నిర్మిత సోపానోపాంత ఘటితాలవాల మూలోదక సేకసంవర్ధిత మల్లికాది వల్లికల కుల్ల సిల్లు చు మృదువాసనా సంయుక్తంబు లగు తదీయ రాజీవ రజోనుసంగ పిశంగితాంగంబు లగు భృంగంబులం గని యుప్పొంగుచు ను దంచిత రోమాంచక కంచుకిత విగ్రహ లయి య న్నెలంతుకలు సంతసంబునం ద దంభః ఖేలనాయత్త చిత్తలై.

సీ. వలరాజు ముల్లోకముల జయించి బలంబు
తేర్పడ శరములు నిడిన చోటు
తనయింటి పెంపు చేతనువృద్ధిబొందన
జ్జోదగురాణి కాపున్న చోటు
మలయానిలమురఁగావలిఁ గాహితవిషాగ్ని
ఘోరతాపము వీడు కొనినచోటు
కుముదినీకాంతతాదమ్రగమ్మరే రాజు
కరమంటి సౌఖ్యంబుఁ గనిన చోటు

గీ నిదియ చూడుఁడి సతులార యిన్నెలంత
నిందు గ్రుంకించి మన్మథు నెసఁగఁ గొలువ

వరలు ద్రుసలని కూరిమివలిపె పావ
డలను గట్టియు నీరాడ వెడలు నపుడు. 42

ఉ. జాణ లుదంచితోన్నతినిఁ జారు సరోవరచంద్రమోక్షసో
పానము లందు డిగ్గి నడుమం దన మోమును నందుఁ జూచి కం
జానన పద్మ మంచును నతాంగకయై తగఁ గోయఁ బోవఁగా
నా నళినాస్య లారసియు హాస్యము సల్పి రనేకభంగులన్. 43

చ. మృగపతిమధ్యవల్లకులు హేల నటింపఁగఁ జక్రవాకసం
యుగకుచకుంభపాళికల యుక్కు దలిర్ప నతాంగులై వడిన్
సుగతిసువర్ణకీలితవిశుద్ధతటం బగు సత్సరస్సునన్
జిగి మెరయం గుభిల్లునను జేవడి దూకిరి సంభ్రమంబునన్. 44

చ. పడఁతులు బిండు గట్టుకొని పాదము పై కెగఁజల్లఁ దద్వారాం
జలి కల శంబరం బెగయు జాడ నుతింపఁగ నొప్పె దత్సనాం
చల కటిభాగఘాతముల సైచక ఫుల్లపయోజయుక్తమై
కొల నల లోకబాంధవునకు న్మొర వెట్టఁగఁ బోవు చాడ్పునన్. 45

ఉ. చిమ్మనగ్రోవిలో నొకతె జీవనజాసవ ముంచి యొత్తు పైఁ
జిమ్మఁగఁ జూచి యమ్మగువ చెందిన భీతిని మోముఁ ద్రిప్ప నం
దమ్ముగఁ గొప్పు కప్పుకొనె తద్ధుతశీధుఁగొనంగఁ బంచుభృం
గమ్ములదండమో యనఁగఁ గన్నుల పండువ సేయుచుం డగన్. 46

చ. బిసరుహపాణి యొక్కరుతు పెంపుగఁ దమ్మిని నున్న మానసౌ
కసి లలిఁ జూచి యాత్మకరకంజము చేతను దానిచంచువుం
బిసగఁగఁ బంకజం బను దమిం దన హస్తకజంబుఁ జీర రాఁ
గుశధరవేణి చాటునకు గొబ్బునఁ బారెను దానిఁ జూచియున్. 47

గీ. అలినిలాలక యొక్కతె యంబు లందుఁ
దెరలి యీదుచుఁ బోవంగ నరసి తమ్మి
మొగ డొకటిం దాని చన్నోనను నొక్క
యంచ పొడువంగ నదరెను జంచలమున. 48

గీ. హాసకౌముదీరుచులకు నబ్జినీప్ర
రంధ్రి మోము ముడిచె రమారమ్యగర్వ
మే కదా యని కర్ణిక నేపె నొర్తు
శ్రీసభఁ గొని కరగతముఁ జేయు కరణి. 49

శా. ఆలోకింప సరోవరాన వికచాబ్జాక్షీసమూహంబు గం
కేళిం జేయఁగఁ దద్గురుస్తనయుగీక్లిన్నప్రకస్తూరికా
జాలంబుల్ హరిచందనంబుఁ బసపుం జక్షోంజనం బారయన్
లోలం బై చెలఁగె న్మనోజ్ఞ మగుచు న్నయ్యోళ్ళ పాదో యనన్. 50

క. సరసీజాకర మందున
సరసీజాననలు కేళి సల్పియు దురుముల్
శరనిధినిర్గతవార్షిక
శరదము ల ట్లొప్ప దరికి జని రుత్సుకతన్. 51

ఉ. కోమలు లా సురోత్తమజకున్ సురపాదపదత్తనూతన
క్షౌమము గట్టఁ బెట్టి పులకంబుల నార్చి సుమాళిఁ గూర్చి ము
క్తామణిమాలిక ల్పెనచి కాంతముగాఁగ నలంకరించియుం
దాము నలంకృతాంగు లయి దర్పకరాడ్భజనాదరంబునన్. 52

సీ. పికసంఘములు కొన్ని మకరాంకగేయము
ల్చెలువొందు నట్లుగాఁ దెలుపుచోటఁ

గనకంబు లని కొన్ని వనజేషుభవనాల
గళికాప్రదీపము దెలుపు చోటఁ
దిలకతరులు కొన్ని జలజేషునకు భక్తి
గుసుమాసవార్ఘ్యంబు లొసఁగుచోట
సహకారములు కొన్ని శంబర వైరికి
నిగురాకుటారతు లిచ్చు చోటఁ

గీ. దనర ముప్పేటఁ బెనగొన్న ద్రాక్షలతల
నొప్పు కర్పూరపుటనంటిచప్పరాల
నొప్పుగాఁ దొరఁగెడి క్రొత్తకప్పురంబు
నెగయ మలయానిలము ధూప మిచ్చు చోట. 53

చ. అఱరుల మంచునం గలిపి యానిన పుష్పాడిదిన్నెపైని న
న్నలదక కాయమానరుచినవ్యవిమానము క్రింద నొక్క పూ
వులదగు సెజ్జ యందు మృదు పుష్కరకర్ణిక గూర్చి యమ్మహో
త్పలగృహసూనురూపమును దద్దయు వ్రాసి కురంగనాభికన్. 54

క. అతని యెడమప్రక్కను నా
రతిదేవిని వ్రాసి క్రేవల సగంధ సదా
గతి శుకతతి నెదురను విధు
ఋతురాజుల వ్రాసి చెలు లహీనముదమునన్. 55

క. ధ్యానాద్యుపచారంబులు
గానుకలును బెట్టి భక్తి గదురఁగ నయ్యో
షానివహము మారునకు న
మోనమ యని మ్రొక్కి రధిక మోదం బలరన్. 56

క. రాజీవబాణ కమలా
రాజీవేక్షణకుమార లాలిత యనుచున్
రాజీవాక్షులు పొగడిరి
భ్రాజితగోకూయమానపరభృతఫణితిన్. 57

మ. అనిలాందోళితమల్లికాగురులతావ్యాలీఢకేళీవనీ
జనితంబు ల్భవదీయవాసగృహము ల్చైత్రుండు నీబంటు నీ
కెనయం దద్వనిజాతసూననికరం బేమిచ్చి మన్నించుటల్
వనజారే రమ్యతార్పణం బనుగతిం భావింపుమా దర్పకా. 58

ఉ. మేరుశరాసనంబును నమేయశరంబును గల్గువాని గాం
తారశరాసనంబును ద్రుణం బగు బాణము లూనియుం జలం
బార సగంబుఁ జేసి తవునా యిలఁ గల్పకసిద్ధు లారయ
న్నేరు జయింప లేఁజిగురు మీరని గొమ్మయుఁ జేవపుట్టదే. 59

చ. ధర మఁట విల్లువేదలలధారిగుణం బఁట యమ్ము జూడఁగా
హరి యఁట బైటిపల్లియల నార్చిన వాఁ డఁట యొండు రెండు శం
కరునిది పౌరుషంబె యని నమ్మిక గల్గవె ముజ్జగంబులం
బొరిఁబొరి నొక్కయించువిలుఁ బూనియు ముట్టెనఁగందుతూపులన్

క. పొలఁతుకలు మరునిఁ జేరొగ్గి
పలుమారును బొగడ మలయపవనుం డరయన్
జలజలమును చేతెంచెను
కలకల మను శుకపికాళి కలకల మెసఁగన్. 61

చ. వడిఁ గమలాకుమారకుఁ డపార విజృంభణ జేసి ముందటం
జడిగొని నిల్చినట్లయిన జాలవడంకి చలించి యెంతయుం

గడుఁవడి గంధవాహజవకంపితభూరుహావల్లికాకృతిం
బడఁతివడం గనుంగొనియు భామిను లందఱు సంభ్రమంబునన్ 62

చ. విసరుద మంటిమన్న సరవిం జెలుఁగార విశీర్యదిష్టవృం
తశిథిలతాసుపుష్పము వణంకఁదొడంగెఁ దుషారమల్లన
న్మసలక జిల్కఁబోఁబొరలె మన్మథకీలవితానయుక్తమై
పొసఁగిన చిత్తపాత్రపరిపూరితమౌ యల స్నేహపూరమున్. 63

క. ఏమి యొనరింతు వెఱ్ఱ్యాన
నేమంచును మందలింత మిత్తరి దగ నిం
దేమందయాన నడుగుద
మేమంద మటంచుఁ జలిత హృత్పంకజలై. 64

చ. అడుగులఁ బల్లవంబులను నానియుఁ జెక్కులఁ జంద్రఖండముం
దొడల ననంటిడోయలను దోర్ద్వయమందు మృణాళనాళము
ల్గడువడి నేత్రయుగ్మమునఁ గైరవపత్రములుం గచంబులం
జడి గొను శైవలంబు లిడి శైత్యములం బచరించి యత్తరిన్. 65

చ. నయ మలరంగ మన్మథుని నవ్యసూనభ్రమయుక్తచిత్తలై
నియమిత భక్తిఁ బ్రార్థనలు నేరుపు మీరఁగఁ జేయ నావచో
చయముల నాదు సన్నుతులు సల్పఁగఁ దా విని జాతచేష్టయై
నయనవనేజము ద్దెరచి నమ్మికఁ జూడ సతు ల్ముదంబునన్ 66

ఉ. ఉండగ నేల బాల మనకూర్చ్చ నమస్యకు మెచ్చి భార్గవీ
నందనుఁ డిప్పు డాదరమునం దయఁ జూచె శుకోక్తి నేను మా
నందము తోడఁ దెల్పె విను నమ్మికతోడను వే సమాహిత
మ్మందెదు సుమ్ము వైళ మని యంబుజనేత్రికి భీతిఁ బాపుమన్. 67

క. లీలావతి నీరీతిని
లీలావతు లెల్ల రుచిరలీలల నపుడుం
గేళీవనమున నుండియుఁ
గేళీధామంబు సేర్చ గెరలుచు నచటన్. 68

గీ. ప్రియుఁడు విహరించు స్థలములఁ బేర్మి మీరఁ
జూచుచు సువర్ణనిలయంబు సొచ్చి యందు
నలసి సొలసి ప్రవాళశయ్యాతలమున
నల సితాపాంగ మె సేర్చి యడలు నంత. 69

చ. తన యనవారితం బయిన దారుణసూనశిలీముఖవ్యథా
స్సన వివశాంగిఁ జేసి యనుకంపయు లేశము లేకఁ గ్రూరుఁడై
చనియెను కృష్ణుఁ డిట్లు విరసంబుగ నంచు మహావిభీషణం
బు నరయఁ దాల్చెనో యన నభోమణి గాంచెను లోహిత చ్ఛవిన్.

ఉ. బారులు గట్టి పక్షులు నభఃపదవిం బరువారె నెంతయున్
సూరశిలల్క-వోష్ణతను జొప్పడె నారయఁగా మరీచికా
వారధు లింకె దిగ్ద్విజపుభాతి నశించె పతంగమండలా
కారము బంధుజీవకపుగాంతి వహించె రయం బెలర్పఁగన్. 71

క. చరమానుషంగలబ్ధాం
గరాగగతుఁ డయ్యు నతిగతుఁ డైన దివా
కరుఁ గని పద్మిని సోలెను
సరవిని వెంబడియుఁజనక ఛాయయు మరలెన్. 72

క. శీతాంశుని మరగి వియ
చ్ఛాతోదరిజరధుఁ డైన సవిత్రుని నొల్లన్

ఖ్యాతిగ నశిఁ బడఁ ద్రోచిన
భాతిని చరమాబ్ధిఁ గ్రుంకె భానుం డంతన్. 73

సీ. పతిరాక సద్ద్విజతతి సూక్తి దెలసి రా
ప్రతి వహించు కుంకుమతిలక మనఁగ
భువనజనిలయంబు మూసి యిను వెదకు
రమ్యపాథోజినీరాగ మనఁగఁ
బ్రియు రాకఁ గనియుఁ గేళినికాయ్యంబున
నపరాశఁ బెట్టు దీపార్చి యనఁగ
నంబు శాధుని నికాయ్యంబుపై నెరవుంది
పొలుపారు జేవురుపూతలనఁగఁ

గీ. దర్ణి మండలపతితవిదీర్ణ జీవ
నీయనిధిగర్భభీకరనిర్గతోరు
మహితఘనశేషఫణిఫణామణిమనోజ్ఞ
మృదులశుచిరుచియో యన మెరసె సంధ్య. 74

చ. అమృతజినీకుటుంబినిమనోధిపుఁ గానక ప్రుక్కి కంజవ
క్త్రిమునను దేఁటి యూరుపుపొగల్గని మూర్ఛను బొందఁ జక్రవా
కము హరి క్వారయం దెలుపఁ గాదె చనెం బ్రియభామినీ వియో
గము సహింపలేకఁ దమ కర్జము లెంతురె మిత్రపక్షముల్. 75

చ. సమయపులోహకారకుఁడు చక్కఁగఁ బశ్చిమశైలతుంగశృం
గము గురిఁ జూచి ద్యోమణిని ఘట్టన జేసి తుపాకి పేల్చఁ ద
త్క్రమమునఁ బోవు ధూమ మన దారుణభంగిఁ దమంబు వే దిగం
తములను జుట్టెఁ దారకలు తచ్ఛకలంబులనన్ వెలింగడిన్. 76

గ. అలసి దివాకరుండు చరమాబ్ధిని గ్రుంకఁగ సంతసంబునం
ఒలి నిలయంబు నుండియును బాఢము గాఁగ భుజంగజాలము
ల్గలఁచుచు నాల్గు దిక్కులను గ్రమ్మెనొ వైరి చన న్విఘంతుదుం
డలుకఁ దమోగతిం గలఁచె నాశలనాఁగ వెలింగెఁ జీఁకటుల్. 77

గీ. ఉప్పరం బను పేరిటి కప్పురంపు
టనఁటిచప్పరముల వ్రాలునట్టి కప్పు
రంపు గుప్ప లనఁగఁ గల్పకంపుకోర
కాభఁదారలు వెలిఁగెనభోంతరమున. 78

క. కోడు కిఁక రాఁగలఁ డంచును
గడుఁ బొంగు సరిల్లలామ కాంతుని వేడ్కల్
ముడివడ నూర్పుల నురుఁగన
వడిఁ దూర్పున ధవళకాంతి వరలెం దిరమై. 79

మ. కకుభర్ణోరుహవీక్షణ ల్గగనరంగస్థానశశ్వత్త్రమో
వక నేపథ్యము నెయ్యన న్వదలఁ గాఁ బ్రాజ్ఞర్తకీకాంతమా
త్రికపట్టంబును ఫాలము న్వదనముం గీర్తించఁ జూపించె నా
గకలాఖాం వెలింగెఁ దూర్పువను రేఖై యర్ధమై బింబమై. 80

మ. ఘనమార్గానమయూఖసూత్రముల వేగం బేరుఱ ల్బన్ని ప్రా
క్తనభిల్లస్ఫుటవాళి రత్నము వియద్వర్త్మాస్ఫురత్కాననం
బున వేటాడ మదేభజాలకము లామోదించి యోదంబులం
గనఁబడ్డట్లుఁ దమంబు జారె బిలసంఘాతంబులం జిక్కియున్. 81

ఉ. ఆసమయాన నాధకుతుకానుగుణాభ్రనదీఝరాలనన్
ద్యోస్పృతి నిందువెన్నెలలు దోఁచగ నిందుఁడు కేళి సల్పు నా

వాసవదంతినా నెగడె వావిరిఁ దన్మథితాంబుజాళి నాఁ
ద్రాసతఁ దాగ లేగఁ బడెఁ దత్కరనీరములై తుషారముల్. 82

వ. వెండియు నిండువేడుక కుముదినిఁ గోసంగుచు నఖండకపిచండిల పాండిత్యమండిత కాండజాహితమండల కుండలిత పుష్పకోదండహిండిత కాండ కైరవప్రకాండ సంజాత తాండవిత పాండుర రజోమండల ప్రభాభాసమానంబై సల్లలిత మల్లికావల్లికోత్ఫుల్ల పుష్పవితానాంచత్కోమల చ్ఛద పుటాంతరామల మకరందంబుల వ్యాపించు మిహిరకరఘృణీసారంబులు సంఫుల్లసౌగంధిక రజోమధురస్వచ్ఛఖండ శర్కరావారంబులం బోలిపి కాసుదంబులకు వెక్కసంబుగాఁ జంచువుబంటి భక్షించి గ్రీవంబులు నిక్కించు చకోరసోదరీ కదంబాశ్రయించు బృందంబుల సందడి వెంటుచు స్వకీయాననార్ణోజ భాజనంబులం బట్టి యాసవంబులు నాథులకుఁ దాఁపించునెడఁ బరిమళ సంయుక్తార్పిత రసాల కిసాలం బని మోవి నొక్క నవ్యక్తధ్వనిత కంకణరంజిత కరంబులు విదల్పుచుఁ దారకల కెప్పుల నప్పళించుచుఁ గలరవనాదసదృశములైన మురిపెంబులఁ జూపుచుఁ బానశాలాపురోభాగంబున వెలుంగు నుశీరకాయమానంబులం దోఁచు వెన్నెలలం బుష్పంబులని పతులమీఁద రిత్తరువ్వు వారును నొక్కుక్కిం దోయ రాని చెలికత్తియలం బొరిఁగోక్తులం జూపి వేగంబ వచ్చి వినూతన కేళీసౌధంబులఁ జొచ్చి భర్మనిర్మితస్తంభముల సత్తమిల్లం బతు లుత్తరీయంబులం బట్టి తివియ మారుమసలుచుం దనువల్లికలం దరుగని వడకులం దనుదాన వీడుకోక ముడిచిఁ బదాంగుళులం బట్టి కౌఁగలించ మిట్టిపడి కదల నేరక పతుల యురఃపంజరంబులఁ జేరి కొంత దనుకఁ గేరడముల కనుకూలించిన ముగ్ధాంగ

సలు గవాక్షోపకంఠంబున మెలంగు జాబిల్లిం గని మెల్లన దాఁగి
చూచు దుండగపు వయస్యాసుస్మితాస్యం బని బెదరిపడి కప్పుకొ
ను చిరుతతాబందులయందుఁ జెన్నొందు కాంతుల దొంగలించిన
యట్లను కమలాహిత పజ్జాతాభినవాపగ గావున సకలభువన త
మంబును బాపుచు నమలకమలాశుగ నిరంకుశ యశఃప్రభానుహారం
బై ప్రకాశించు నవసరంబున. 83

ఉ. సిద్ధపుఁ దెల్ల వెన్నెలల నిండుగ నిండుఁడు వచ్చెఁ బంచబా
ణోద్ధతి హెచ్చె శీతపవనోద్ధతి మీరెఁ ద్రివహ్నులిచ్చటం
దద్దయుఁ గూడ నిల్చునె సితంబిని యమ్మకచెల్లటంచు హా
ముద్దియ లూర హేమలతమోద సమస్తగుణప్రపూర్ణ్యయై. 84

గీ. తరుణులార తుషారాంశు కిరణములు క
పోలముల గీటుకయ మున్న పుష్పశరశ
రములు దృగ్వీధిఁబడకమున్న మనకాంత
యుత్తలముఁదెల్పి కృష్ణునిచిత్తమరసి. 85

క. వేగంబ వత్తు నని మద
నాగ రమణ మందయాన నలినేక్షణ సం
భోగమణిహార మూనియు
నేగుటయును సరగ నిచట నెనయఁగ నంతన్. 86

శా. కేళీధామ గవాక్షజాలముల చక్కిం దూరి జైవాతృకా
శ్లాకీకుడ్యము లెల్ల సీరులుగ వేజారంగఁ గాపించి మై
జాలన్ భామిని రూర్ప్వలేక వెతచే సత్వార్జినీజాలికిం
జాలా కీడగు నట్టి చంద్రుఁబలికెం గాఢానులాపంబులన్. 87

ఉ. సద్వనజాతలోచనలఁ జాలఁగ నేచెడి పాపి చంద్ర నీ
వాద్విజరాజ విప్ర డరయన్ ద్విజనాథుఁడ వైన నీకు నీ
పృథ్విని జూడఁగా నహివిభీతి నశించెనె దోష మారెనే
యీద్విజరాజనామ మిఁక నీకు ధరింపఁగఁ జెల్లదెంతయున్. 88

ఉ. కాంతల నేచు పాతకము గావున నింతటఁ బోదు పాంథలో
కాంతక నీ వపుస్సబదియారగు చెక్కలు జేయ కెంత ని
శ్చింతియె కాక బొక్కుదురు పృథ్విఁ జకోరకము ల్దివి న్సురా
నంతకదంబకంబు లయి నజ్జుగఁ జేసి కురంగపోషకా. 89

క. విషరాశిఁ బుట్టినాడవు
విషధరమార్గంబు నందు విహరించెద వా
విషభు క్శిర మెక్కితి విది
విష మెట్లగు జీవకృతపు ద్వేషము చంద్రా. 90

ఉ. శౌరి భవద్విరోధిపయిఁ జక్రము నంపఁగ నాత్మనాయకో
దారవిరోధి వైన నిను దాను మొరంగియు రాహుఁ జంపియున్
మారణ మాచరింపకనె మన్నన నేగెను దాని వేఁటున
న్దారణమొంద నట్టిది కన న్గలదే భువి దోషపుంజమా. 91

శా. కించిత్కాలము నిన్ను జిత్తమున నోగిం గూర్చు నా శౌరికిం
జంచన్నేత్రవధోతిపాతక కళంకం బట్టె పండెం భుజం
గాంచద్భూషుఁడు నీ కళ న్శిరమునం గాంచి లోకంబులం
బంచత్వం బొసరించు దుండగుఁడ నీ పాపంపు స్నేహంబుచేన్.

మ జలజాతుండవు నీవు ప్రీతినిఁ బయోజాతప్రజ న్నేనటం
చిల మోమోటముఁ జెప్ప సిగ్గగును గాదే నీదు తోఁబుట్టు స

న్నిలయంబే చెడఁగొట్టు దీవు కన దానిం బుట్టునం జూచితే
నలయింప న్వరణం బొనర్పఁ గలదే యాశ్చర్య మో చంద్రమా. 93

క. అని యి ట్లనేకవిధముల
వనజారిని దూరి భీరు భామాజనతా
ఘనతాపవహ్ని ప్రభృతవ
వ్యనుతాశుగ ధరుని స్మరుని వివరించి వెసన్. 94

క. విడువంగ వలదు మారుఁడ
బెడిదము లగు బాణములను బెంపెసలారం
బడఁతుల దాయవె కలవే
తడయఁగ నిటువంటి గాఢ దారుణవృత్తుల్. 95

చ. జగముల కెల్లఁ దల్లి యగు సారసగేహిని పుత్రకుండ వీ
వు గురువధూమణిం గలసి భూరితరం బగు పాప మొందె వా
తొఁగ నిబిడంపు విందుఘనదుష్కృతచిత్తుఁడు వానిఁ గూడఁ గాఁ
దగునె రమాకుమారక విదారితపర్వసువర్వచిత్తకా. 96

మ. అవురా క్రూరుఁడ జీవమాత్ర చరితార్థా వాఁడు పన్నీటితో
జవియౌ వంశ్యులు నీయెడం గిలికె గా సకోగ్రిధచండస్ఫుట
ద్భవనేత్రాగ్నిని మాడు నీకు నతులం బాపించి వే జెప్పినం
జవి పుట్టించునె మానసంబునకు నోజం బోధ సిద్ధించునే. 97

మ. పధికోపాసన నీ కకారణపు కోపంబుం బ్రియోక్త్యాళిచే
న్నధికామర్షము శీధుపానమునఁ గాదా కల్గెఁ గాకున్న యా
డుదువే నీవనిలాంకురంబు పయి సంతోషంబుతో నెక్కి మూ
ర్ఖద వన్యావిహగాళి చేఁత బనులం గావింపఁ గాఁ జూతువే. 98

చ. పథికవిరోధి వంచు నిను భర్గుఁడు ఫాలవిలోచనాగ్నిచే
వధ బొనరింపఁగాను రతిబాష్పముల న్మొల కెత్తి చూడ నీ
పృథివినిఁ బాంథ బాధకయి పెంపుగ లేచితి వోరిమార నీ
వసువు పతివ్రతామహిమ బాపురె యెంచఁగ నెట్టిదో కదా. 99

చ. భవనయనాగ్నిఁ గూలిన బ్రపంచములం బ్రతికింప లేదె వి
ష్ణువు నిను వామలోచనలఁ జూచి సహింపనివాఁడ వౌట చే
ధ్రువముగఁ దా నుపేక్ష మది యూఁదిగఁ బూనె నసంగ కానిచో
భువి నతఁ డేమిసేయుటకుఁ బోలఁడు నీదగు పాపమారయన్.

ఆ. అనుచు నిం మువిలుతు నాడి గెంటసముల
నలిని మోయుచుండి యూఁకు పవను
మీఁద నలుక వొడను మీనాక్షి యప్పుడు
వలికె గాఢ మైన భాషణముల. 101

చ. అకటకటా ప్రభంజనుఁడ యంబుజబాణునిఁ గూడి భూమిఁబాం
థకనికరంబులం గలఁచ ధర్మమె పంచజనుల్మనుం దగక్
ప్రకటతరోజ్జగంబులకుఁ బ్రాణుఁడ వంచుఁ దలంతు రిప్పుడీ
వికటపు చైద మూనకన వెండియు నేచఁగఁ బూనఁ గిన్కతోన్.

క. కీలాలజభవుఁడిదిగో
గోలల యుసురులను బోసుకొందు వనియు న్నో
బాలానిల నిను మెక్కఁగ
వ్యాళము నను నేండ్లు వేయుఁ బరగించె వెసన్. 103

సీ. బాలానిలము గ్రోలి బైటను విడచిన
శేషోరగ రసజ్ఞఁ జింపఁ దగదె

అలితండములనెల్ల నలిజేయలేనట్టి,
సంపఁగి రేకును వంపఁ దగదె
శుకములఁ జంపలేక కలంగు జవ్వాది,
పిల్లులకుంజాల వెయ్యఁదగదె
విసుని మ్రింగి విడిచి పెట్టిన యట్టి వి,
ధుంతుదు మస్తంబుఁ దుంపఁ దగదె.

గీ. యనుచు వారలఁ దెగడుచు నబ్జవైరి
కిరణఝరి మునుఁగ సకియ లరసి హాయ
టంచు వనరుహ నడగింప నధికశోక
మాత్మ నుమడింపంగ నబ్జాక్షి యంత 104

శా. ఆ చంద్రాశ్రితప సాంద్ర సాగరము డాయన్లేక రాకాహిమో
చ్ఛోచిశ్రీసఖమైన వస్త్రమున సచ్ఛోభాపటాగ్రంబుచే
సూచింపగను మూసి యేడ్చె సురసజ్యోషాకరాంభోభవో
త్సాచద్వల్లకి నిస్వనామృతఝరీస్తోమంబు ఘోరంబుగాన్. 105

క. అప్పుడు చెలి నూరార్చియు
రెప్పల బాష్పముల దుడిచి రేపే కృష్ణుం
డొప్పుగ వరియించును మా
యప్పవుగాఁదలచ కమ్మ యతిసాహసముల్. 106

క. అని వ్యావయు మూరడిలికియు
మన హేమలత చని తడవు మసలె. దరణీనం
దన కొందలంబు నెఱుఁగదె
మనమున విరహంబు దాను మాన్పఁగఁదగదే. 107

వ. ఇట్లనుచు నెట్టులో యని పొలంతుక లన్ని దెసల నాలోకించు న
వసరంబున నుదయరాగ మనోహరంబున రంజిల్లు భాస్కర కాం
తి నెంపుం బోగొట్టి మంజులరాగ రంజిత వేషమం బాకాశరమ
కాపాదించు దివ్యప్రభా వితానంబు కట్టెదురం బుట్టం జూచి య
న్నలిది తన తనయ యైన కాళిందిపై నీసడించిన శర్వరీకాంతుం
దోలం బుట్టిన లోకబాంధవుని పొడు వని యాడుకొనుచుండ నం
త నా శ్రీకృష్ణార్పిత నవారవింద రాగ ముద్రాంగుళీయక రంజిత
నిజకరాంభోజయై హేమలత యేగుదెంచి. 108

క. వచ్చి కరిరాజవరదుం
డిచ్చిన ముద్రిక వధూటి యెదుట నిడం జెలున్
మచ్చిక నడుగఁగ నిట్లను
నచ్చెల్వ తనదు ప్రవృత్తి యంతయు వేడ్కన్. 109

ఉ. కొమ్మరొ వేగఁ బోయి మనకోమలి యుత్తల మంత శౌరికి
న్నెమ్మదిఁ దెల్పి రమ్మనఁగ నీరజలోచనలార యట్టి కా
లమ్మున నంబరోత్పతనలాలసవేగము పొంది యేనుప
ట్నమ్ములఁ బల్లెలం గడచి దబంగు తోటను గంటి నొక్కచోన్.

స్రగ్ధర. ఆ పూవుందోటలో మంజ్వమలమణి విభాహాటకోల్లాసితంబై
సోపానోపాంతమల్లీరుచిరుచిలతికాస్తోమసంరంజితంబై
యోగ్యపంథోచ్చుంబితోద్యత్సురుచిరతపనీయాఘుచంచత్సుసాలం
బై పొల్పొందే సులీలాహలికనిలయ మొండచ్చటం గంటినందున్.

క. హరిహాయసౌధనిభంబులు
హరిమణికీలితము లన్ని హరిపదమార్గా

జిరలంఘనంబు లన్నియు
హరిమంగళధామ మెద్ది యని చింతింపన్. 112

క. ఒకసౌధముండి యిద్దరు
శుకవాణులు వెలికి వచ్చి చోద్యం బొప్పన్
వికలమనోగతులై తగ
సకలంకతఁ బలికి రిట్లు చయ్యనవారల్ 113

శా. ఏమే చంద్రవిలాసినీ యనుచు నేమే సాళ్వతీ యంచు నీ
వామామన్మథు చంద మెట్లనుచుఁ జెప్పం జాల శ్రీకృష్ణుఁ డా
రామానంతకు నేటలాడఁ జను ఘుస్రం బాది నిద్రాసుఖా
లేమో మానె ననంగ వింటిఁ దమలో నేకాంతహేలాగతిన్. 114

క. అది యాలకింప నప్పుడు
మది కా సౌధంబ యంచు మానిని దృఢమ్ముం
గదురఁగ మెల్లన హర్మ్యము
గదియం జనుదెంచి యందుఁ గదిసియు నొకచోన్. 115

చ. హరిహయ రత్నకీలితములౌ రుచిభిత్తిక లంద మొందఁగా
సురుచిర మైన ద్వారముల సుందర మొప్పఁ బసిండి ప్రాఁతలం
గర మరుదారు దల్పులను గన్నులపండువ సేయు నొక్క మం
దిరమును జూచి యందు నతి నిశ్చలవృత్తినిఁ జొచ్చియొక్కచోన్

మ. బలరిపురత్నకీలితపు బంగరుకోళ్ళ బసిండిప్రాఁతచే
దులుకుచు నుండు నట్టి తెరతో నెరపైతగు మేలుకట్టుతో
జెలఁగెడి సెజ్జపై నొరగి చెక్కిలితమ్మి తలాడపైఁ బదం
బులు జిగురాకు దిండుపయి మోపి పటంబులు జూచుకృష్ణునిన్.

చ. కనుఁగొని వీని మానసము కంజహితాత్మజయందు నుండునో
వినమరియొక్క కాంతపయిఁ బెంపుగ నుండునొ యిప్డుమాత్రుఁ గా
కని లస దుల్లసత్సురభిగంధసితాభవిపూరితంపు భా
జనముల ప్రక్క నల్లనను సంభ్రమ మొందుచుఁ బొంచియుండఁగన్

క. ఉసురనుచుఁ గన్ను మోడ్చును
దెసలను వీక్షించు శయ్యఁ దెరలం బడు హా
కుసుమసుగంధీ యనువిన
ప్రసవాశుగభేదితాత్మపంకజుఁ డగుచున్. 119

క. మన మందు గతముతా భా
వనభావిత భావము లిటు వరలఁగఁ గృష్ణుం
డను చిత్రఫలకమందునఁ
గనఁ బడు నావనితఁ జూచి కడువడి నిటులన్. 120

శా. ఏమే యల్క కిసాలపాణి పలుకే హేమంబటే పల్కవే
రామారత్నము! యేల రాతివలె సాంద్రస్వాంతముంబూనితే
ప్రేమ న్నీదు కుచోపగూహనముఁ బ్రేరేపించి వేగంబ నీ
వే మన్నించి వధూటి నీ కరయ నేనెగ్గందుఁ జేయం జుమీ. 121

శా. లీలావాసము నుండి యేగుచును దాళీసంఘ మడ్డంబు రా
వ్రీలం జంద్రముఖంబుఁ ద్రిప్పియయు నను న్వీక్షింపఁగా నప్పుడే
నోలిన్ రత్నముఁ జేసి తంచు మది నే యూహించితిం గాని యీ
కీలాలేజ శరార్తి ముంచు మెటుఁగన్ కీలాజజాతేక్షణా. 122

ఉ. ఆ పలుకు ల్మనస్సునకు నామెత గాఁగ సుధాబ్ధికాతుకా
వాపతరంగసంఘములఁ బొల్పడి తేలియు వీని చిత్తమెం

తో నెరిమం దివాకరజ దోఁచిన యట్టుల నిశ్చయించి నే
నో పడతీ రయంబున సుహాగతఁ జిత్తరుబొమ్మ నోర్తునై. 123

చ. పకపక నవ్వి కృష్ణయిది పాడియె నీకు సురోత్తమాత్మజ
న్మకరపతాకరోపముల మ్రగ్గఁగఁ జేసియు నేగు దెంచి యా
వికసితపద్మలోచనను బెంపుగఁ దూరెద వేడ్క నైన ము
గ్ధకలు దమంతటం బురుషతల్లజుల న్వరియింపఁ జూతురే. 124

చ. అని యిటు లేను బల్కి విని యచ్చెరు వాత్మఁ జెలంగఁ జంచలం
పునయనుఁ డయ్యెఁ గంటకితపూర్ణసమస్తలసత్ప్రతీకుఁడై
ఘనరుహబాణలుబ్ధకవిపాటనఝూటవిలుంఠితాత్ముఁడై
మనము ఝులుక్కనం గరము మారుచు నుండుఁ దలంపులూరఁగన్

క. చారణసతియో ఖేచర
సారసలోచనయొ లేక సవితృకుమారీ
ధీరసఖి యైన యొకసతి
వే రాఁ బోలును లతాంగి వివరముఁ దెల్పన్. 126

చ. అన విని రామచంద్రుఁడు చరణాంతిక మందునఁ బొల్చు ప్రస్తరాం
గనక్రియ లేచి కృష్ణునకుఁ గొంతె నమస్కరణంబుఁ జేసియున్
మనసతి యుత్తలం బతని మానస మూరఁగ విన్నవించి యా
మణిమయహార మాతని సుమంగళి కంఠమునందు వేయఁగాన్, 127

ఉ. హారము చేతఁ బూని యతఁ డాదర మొప్పఁగఁ జిత్రభంగులన్
సారసనేత్రిఁ గూర్చి పరిచారిక సంఘముఁ గూర్చి ముద్దురా
కీరములం గురించియు శిఖిప్రకరంబులఁ గూర్చి సేమ మా
హారమయంచుఁ దానడుగ నంగన యందలి ప్రేమ నెంపుచేన్

గీ. అని యనేక విధంబుల నంబుజోద
రుండు భామినిఁ గూరిచి రూఢిగాను
బలికి నను జూచి కృపతోడఁ బలికె నో స
ఖీమణీ బాలసౌఖ్యంబు నీమములర. 129

క. ఇత్తెరిఁ జెప్పితి విఁక నా
చిత్తంబున ఖేద మణఁగఁ జెలి నెత్తి సఖీ
యుత్తమరథమున నుంచియుఁ
దెత్తుము తోషంబు హెచ్చ దివిజులు మెచ్చన్. 130

మ. అని యీ శోభనవార్త వీసఖిని డాయం బోయి వేఁ దెల్పియు
న్వనజాతేషుహాతిం గృశించు నసువుల్ బాగ్రిపించ శాంతింపఁగా
వనితా చేయు మటంచుఁ జేరుకొని శోభాముద్రికం దీసి యి
చ్చి నను న్వీడ్కొలుపంగ వచ్చితి సుమీ చెన్నొందు భామామణీ.

క. అని చెప్పుసఖియ లందఱు
ఘనకుతుకముఁబొంది రపుడు కాంతామణితా
ననువుగ ముద్రికఁ బూనియు
ననఘోల్లాసంబులోడ నలరుచు నుండెన్. 132

చ. ప్రసవసుగంధి సద్హృదయపంకజఖేదము మాన్ప వచ్చితి
ట్లోసఁగుచు నుండు నా హారికగోర్మికఁ గాంచి పభీతిచేత నా
వసునిధిపుత్రికం బొదువ వాడియుఁజాలక తొఁగ ధాటితోఁ
గుశజపదాతు లేగ ననఁ గొబ్బున వీడెను పాండుచంద్రికల్. 1?8

క. వివిధాశాగతిరవితో
పరిరతి వేదపథక స్మరగ్రలయికఁ

భవినారత మే విధి యని
చవిఁ గొల్పెడి రీతిఁ గోళ్ళు సరవిం గూసెన్. 184

క. ఆ సమయంబునఁ గననొక
భాసితవనజాతవక్త్రి పణఁతిఁ గని యనున్
భాసురవికసితవనజా
తాసవమధుమధురభాష ణావళితోడన్. 185

చ. శశి రజనీసతిం గలసి చంద్రిక గెందముచిట్లిపోవ న
భ్రశయనముం ద్యజించి చన భామినికాలభుజిష్యవచ్చి త
ద్భ్రశసుఖశీర్ణతారగణదీపితహారమణివ్రజంబు నే
రి సరగ నెక్కుచో నిడిన రీతి మనెం గను వేగురిక్కమున్. 186

మ. ఉడుసస్యంబు ఫలింపఁగా గగనవప్రోదారసచ్చంద్రికా
జడ మారంగను గోతఁగోసి ఫలసత్సంఘం బనేహఃకృషీ
వలుఁడు దూర్పెత్తె ననంగఁ దోఁచెఁ దెలుపుంగో మొప్పఁ బ్రాగ్దిక్కునం
దుడునాథుం డటు తత్పలాలమునఁ గ్రియం దోఁచె నిస్సారుఁడై.

ఉ. కాలమహర్షి తా నుదయగాఘకుభృత్తున కల్లఁ బ్రాక్క్రకీ
లాలజనేత్రియందు సుతలాభము గల్గఁగ సాంధ్యహోమమం
భోలను దారకాళిచరుభక్తము వేల్చఁగ మెచ్చి వహ్నితా
బాలుని నిచ్చెనో యనఁగ భానుఁడు భాసిలెఁ దూర్పుకొండపై.

క. అని సర్వముఁ దెలిపినఁ గ్రొ
న్ననవహనుపు డిగ్గి పుల్లనలినాస్య దినా
వనకృత్యంబులు దీర్చియు
తనసఖులం గూడి యుండెఁ దద్దయు వేడ్కన్. 189

గీ. అంత నచ్చటఁ గృష్ణుఁడు హర్ష మొదవ
నిత్యకృత్యంబులను దీర్చి నెమ్మదిని ర
థాధిరూఢుఁడై యర్జునుఁ డంటి రాఁగ
వెడలె దరణిఫ్రతిరిక మీఁది ప్రేమ హెచ్చ. 140

వ. ఇట్లరిగి యకాంచనకేళీధామంబుఁ బొడఁ గాంచి యకాంచ
నసుగంధిన్ సఖీజనపరివృతఁ గా నమ్మహారజత నిర్మితరథాధిరోహణం
బు సేయించి సుఖవాయువు లెదురుగాఁ జన నింద్రప్రస్థపురంబు
మీఁదుగాఁ జని ధర్మజ భీమ నకుల సహదేవ కుంతీ కృష్ణసహితం
బుగాఁ గృష్ణుండు నిజపురం బైన ద్వారవతిఁ జేరి సుఖం బుండు
నవసరంబున. 141

ఉ. అంతట రాముఁ డాదరము నాత్మఁ జెలంగఁగ భవ్యలగ్న మొం
డెంతయుఁ జూచి మంత్రినివహేష్టపురోహితదండనాథసా
మంతులఁ గాంచి సంభ్రమణమంగళసన్నహనానులాపము
ల్యంతులు గూడఁ బట్టణపు వాడల వేఁగయి సేయఁ బంచినన్

సీ. పన్నీరసత్ప్రభాపటలితోడను బొల్చు
మృదుకీరములతోడి మేరువులను
నూనిరి యధి కాయమానరంభలతోడఁ
దనరుచుండు హరిచందన నగములఁ
గుదురు కొల్పిరి వజ్రకూటదీప్తులతోడ
నగభేదిమణివితానములు కొన్ని
గీకొలిపి రల హేమాకృతివ్రజముతోఁ
జిత్రరేఖల పజ్క్తి చెన్ను మీర

గీ. సుచితమహాస్థానముల కుముదోత్తముల
నునిచి రందంపు పుండరీకనివహంబు
మనములందున సంతోష మినుమడింప
హరిపురమువారు సూచి చోద్యంబుఁ జెంద. 143

చ. వరణపు సాలభంజికల వారము గాంచుచు నుండు దేవతా
సరసిరుహాక్షులం ధ్వజమిషం దగఁ బిల్చి విడెంబు నివ్వఁగా
బురరమ యెత్తు బాహు లనఁ బొల్పు జెలంగఁగ నాటి రెల్లెడన్
హరువుగఁ జారునాగలతికావృతరంజిత పూగసాలముల్. 144

చ. గురుపరిపక్వహృద్యఫలగుచ్ఛసమత్కదళీకదంబకో
ద్విగచితకాయమానముల వ్రేలు ఫలప్రకరంబుఁ జూచి పై
గురిగొని వచ్చు రాచిలుకగుంపులఁ బోలుచు నుండెఁ జూడ న
ప్పురవిపణిప్రకోష్ఠగణభూరిహరిన్మణితోరణావళుల్. 145

ఉ. హిమజలసిక్తయై రుచిరహేమపటావృతయై నవోల్లస
త్సుమగణగుంభితాంగ యయి శోభనచందనలిప్తయై ప్రకుం
కుమపరిలిప్తయై యగురునూతనధూపకధూమమేఘసం
భ్రమపరిజృంభమాణశిఖివాలకయై పురకాంత రంజిలెన్. 146

ఉ. హాటకపత్రికాళి నుపయామకసూచకవాచికంబు లే
నాటఁగఁ జేసి సర్వమహినాథుల కంపిన వారు మాళులం
బోటరికించి భాగ్యశుభబోధన నేడు గదా యటంచు వే
హాటకభాగధేయముల నప్పుడు దెచ్చిరి కౌతుకంబునన్. 147

వ. అంతమృదంగఢక్కానకఝర్ఝరాదిమంగళవాద్యభేదంబులచేతను కాహళాది భాంకారనినదంబులచేతను మేదోభాగంబు భోరుక

బుగఁ బరిహసిత రంభాద్యప్సరోవితానంబులైన యప్సరో నికురుం బంబులు వినూతనలాస్య ప్రకరంబుల సల్పుచుండఁ బుణ్యభామినులు పెండ్లిపాటలు బాడ నమాత్య వంది మాగధ సామంత వర్గంబులు బలసికొలువఁ బురోహితులు లగ్నం బాసన్నం బయ్యె నని హెచ్చరింపం గొందఱు పుణ్యాంగన లరిది వాణంబుల హరిద్రాత పర్వికాఫలహరిచందనవీటికా మంగళాక్షతలు దో తేరంగ హాలాయుధుండు దలమోసలనుండి పరిణయప్రయత్నంబు సిద్ధపరుచుచుండ నతని ప్రసాదం బెఱింగి భామినీవితానంబు కృష్ణునకు నకాళిందీదేవికి శిరసంటి గంధామలకంబు వెట్టి మజ్జనం బాచరించి పుష్పంబు లలంకరించి కల్పకప్రదత్తకోమలక్షౌమంబులం గట్టఁ బెట్టి మాలికలం బెట్టి సుగంధంబుల నలంది మృగనాభికాచిత్రకంబులం దీర్చి వివాహవితర్దిపై నిలుపు నవసరంబున. 148

చ. విధిసహితంబు గా సుర గవీ దధియుం బుధవృత్తపుప్పస
న్మధుమధుపర్క మొక్క రుచిమౌక్తిక నిర్మిత పాత్రఁ దెచ్చి యా
బుధనికురుంబ మస్తక విభూషితచారుకిరీటరత్నసం
ఘాదధితమండితోల్లసితకాంతపదాబ్జున కిచ్చి రంతటన్. 149

చ. అపుడు కుటుంబినీప్రవృత్తన్మై పదచిన్నకధన్యమౌ సితా
భపు నును ముగ్గపై మకరపద్మము లేర్పడ వీక్షణచ్ఛవీ
స్నపనసుకుట్టిమంబు పయి నవ్యవినీలపు గాంతు లీన నా
తపనకుమారి వచ్చె హరిధార్మికభాగ్యకలక్ష్మియో యనన్. 150

ఉ. భామిను లా ప్రకారమున భాసురఫుల్లపయోజలోచన
న్నేను మెసంగఁ దెచ్చి గురునీతిఁ బురోహితు నాజ్ఞ చొప్పునన్

హేమపటంబుఁ దీసి మన మెప్పుడు మాకు నటంచు నూరఁగా
సామతఁ గల్పి రల్ల కవజక్క్రవలం గదియించు కైవడిన్. 151

గ. హరి కరగ్రహణంబునను నంగన హస్తజతేజ మొప్ప సుం
దరి కరసర్గచేత హరిధర్మకరంబు ప్రకాశ మొందఁగా
సురుచిరమై చెలంగ ఘనశోభలు వేదహితంబుగాను నా
హరికరమందు బాలకరమందును గట్టిరి కౌతుకాంకముల్. 152

చ. అతినికటంబు లగ్న మని యాప్తపురోహితు లెల్లఁ జెప్పఁగా
మతిపతుకంబు హెచ్చఁగను మంగళసూత్రముఁ జేతఁ బట్టి యా
సతిమృదుకంఠమందునను శాశ్వతభవ్యగుణావహుండు దే
వతలు నభస్స్థలి న్నిలచి ప్రస్తుతి జేయఁగఁ గట్టె నంతయున్.

మ. జలజాతాక్షి సతీకరోన్నమితయై చంచన్ని జాస్యోరు నా
దల వేసేసలు జల్లెఁ దత్పతి శిరోధావళ్య రత్నంబునన్
విలసత్తోయ్యద్గతసన్నిజాకృతి దగ న్వీక్షించి వీక్షించిరే
చెలి కృష్ణు న్నిర మెక్క నంచు సకియ ల్జెన్నొందఁ జర్చింపఁగన్.

ఉ. సుందరి కౌతుకానఁ గరపుష్పల ముత్యపుసేసఁ జల్లె నా
చందనగంధిపై హరియు సంభ్రమ మొప్పఁగ నట్లు నించ నా
సుందరి వాలజాలకరశోభనగాత్రలతాచ్ఛవిప్రస
క్తింపఁగఁ బెక్కు వన్నెలగు దివ్యమణివ్రజమై చెలంగఁగన్. 155

సీ. అంతట నగ్ని హోమాద్రిదికృత్యంబుల
సవరించి యమరంగ సన్నికంటిఁ
దాకించి తగ నరుంధతి దివ్యదర్శన
మాదియౌ విధులను నమరఁ జేసి

యభిజాతవేదులు హరువొప్ప జాతవే
దుఁ బ్రదక్షిణములచేఁ దుష్టుగాఁగఁ
జేయించ విబుధులు శ్రీవేదహితములౌ
సార్ద్రాక్షతలు శిరమందు వేయ
గీ శేషహోమాంతముగఁ బెండ్లి సేయ నాత్మ
బంధుజాతంబు లుత్సవం బొంది యపుడు
దివ్యమణిదంతఘోటకద్రుప్తపట్ట
గణకుల నొసంగి రెంతయుఁ గానుకలుగ. 156

చ తులికెడి ప్రేమఁ జొట్టములతో మణిపాత్రములందు నంత ను
జ్జ్వలదమృతాన్నము ల్గుడిచి సాదరణంబున బంధురాశికిన్
వెలగొను కట్నము ల్పొసఁగి వేడుక నుంగళలగ్నమందు ను
జ్జ్వల మగు కమ్మవీడె మొక భామిని యీఁగొని కృష్ణుఁ డొప్పఁగన్

ఉ. బంగరు వ్రాఁతతోఁ జెక్కలిపట్టిన గోడలు కాంతులీనఁగాఁ
బొంగడియింద్రనీలములు బొల్పుగ ముత్తెపుచందువాలు వి
రంగ హరిన్మణీవిసరరంజితమైన కవాటము ల్పెలం
గం గయి నేసి యున్న యొక కాంచనచారుగృహాంతరంబునన్.

చ కెలఁకుల యందు వజ్రములు కెంపులు మధ్యను మూల మౌక్తికా
వళులుఁ బరస్థలంబులను బచ్చలు నిద్దపు నీలపట్టెద్దముల్
వెలయఁగ నొప్పు చూడు, లను వేయును లక్షయుఁ గోటి యైనను
న్వెల యొనరింప లేని యొక నిద్దపుఖట్వముపై వసింపఁగన్. 159

చ. పునుగు జవాది కస్తురియుఁ బొల్పగు గుంకుమ యక్షుధూపచం
దనఘనసారవంశకవితానము నిద్దపు పైడి గిన్నెలం

దెనయుఁగఁ దావి కప్పుకొన నెంత కెలంకులఁ దా చిరాలస
ద్ఘనగృహవాసనారుచిరగాథ మిఁకం దెలుపంగ శక్యమే. 160

గీ. ఉండె శ్రీకృష్ణుఁ డందు మే నుబ్బుచుండ
నఖిలభూచక్ర మేలిన యంతవేడ్క
నమరలోకనాథుం డయి యర్భకుఁ బలెఁ
గన్న మార్గంబు నరయుచుఁ గలఁతతోడ. 161

క. కాంతామణి నా ప్రౌఢలు
గాంతునికడ కంపఁ దారుకై సేయుటకై
వింతగ మొగమునఁ జిరునగ
వెంతయుఁ దనరంగ ముదితహృత్పంకజలై. 162

సీ. కాంచీమతల్లిక గట్టిగా బిగియింపు
సయ్యాటముల నీవి సడలకుండ
గోళ్ళచేఁ దడయంగఁ గుంకుమగంధంబు
నలఁదుము కౌఁగిళ్ళ నలుగకుండఁ
జేర్చుకొ నోచెలి తీర్చి దిద్దుము స్వేద
కంకణముల చేతఁ గరగకుండఁ
జడకుచ్చు చేపట్టు ముదునాథముఖి వడి
విరులు వేనలిఁ బట్టి వీడకుండ

గీ. గలికి నిన్నిప్పు డాతఁడు గారవించు
నీదు శృంగార మారసి నెయ్యమునన
టంచు సకియలు నవసంగమార్హరుచిర
లీల నెసఁగించి రారయ లేమ నంత. 163

క. జాల మిదియేల ప్రియునకు
బాలా విడె మియ్య నిపుడు బాగు తఱి సుమీ
గోలతనంబునఁ బ్రియునకు
వ్రీలపడుదు గాని యిచటఁ బెనఁగుట తగవే. 164

సీ. ప్రేమసామగ్రిచేఁ బిలిచిన జనుఁగాని
గడసియు నూరకుండెదవు సుమ్మి
విద్యము నియ్యంగఁ బెనఁగి యొఁ బుచ్చుకొ
నుదుగాని యూరకుండెదవుసుమ్మి
హస్తంబుఁ బట్టంగ వారయ నిచ్చుచుం
డుదుగాని యూరకుండెదవుసుమ్మి
యుత్సంగమందుఁ దానుంచఁబోఁ గూరుచుం
డెదుగాని లేచిపోయెదవుసుమ్మి

గీ. ప్రియుఁడొకింత మనమున సిబ్బితి జనింప
నూరకుండినఁ జైటకు నెనర వత్తు
వుసుమి చక్కఁగఁ గొంత నాథసముఖమున
నిలువుమీ సాలభంజిక చెలువుమీరి. 165

క. అన వలెఁ గనుక వచించితి
నినుఁ జూచియుఁ గృష్ణుఁ డొర్చునే శ్రీకృష్ణుం
గని నీవోర్తువె వికసిత
వనజాయతనేత్రి నాడు పలుకు నిజముమా. 166

ఉ. ఎచ్చట నైనఁ గౌతుక మదెంత శుభం బగువేళఁ బాన్పుపై
నొచ్చములేని కూర్మి మది నొప్పఁగ నెక్కనివారి నో చెలీ

యెచ్చటఁ జూడలేదు గద యీసఖిగొన్గుచునుండె వీరలే
గ్రుచ్చుచు గౌఁగలింతలను రూఢిగ వీడ్వనివారు నాథులన్. 167

ఉ. తొందరకాదు మన్మనుఁడు తొయ్యలి వెన్కయు ముందు లేదు వే
తొందరకాదు నీమగఁడు తొందరకత్తెవు నీవు వీరి యా
నందకటాక్షరోపములు నాటఁగ నెమ్మది వేళ లేఁతువే
ముందర నిట్టి సిగ్గులు సమోదత నెచ్చటనుండు నారయన్. 168

క. కన్నెర్జఁ జేసి చూచిన
కన్నుబొమ ల్ముడిచినను మొగము ద్రిప్పంగా
నెన్నఁగ నంగములను గన
కన్నియ మాకిపుడు నమ్మికలుగావుసుమీ. 169

చ. అని కయిదండ నూన నొక యంబురుహేక్షణ యొక్కనూత్నమో
హనరుచితారకోపమనఖాంకురకుంతలము ద్దెనుల్ప శో
భనశకునమ్ము లొక్క మృదుభాషిణి దెల్పఁగ సంతసంబునన్
మణిమయధామ మల్లనను మంజులపుగ్రహ చేరఁ బోవఁగన్. 170

ఉ. బాలకుఁ దాల్మి వోవ మది భారపు సంభ్రమమునుం భయంబు హే
రాళము గాఁగ మైఁ జెమట రంజిల సొక్కుచు నొయ్యనొయ్యనం
దూలుచు నేగుదెంచె బలితూలఁగఁ బాలికిన్నాళులెల్ల వే
లీలలఁ జెప్పఁగా మనసు లీనము గాఁగ రయం బెలర్పఁగన్. 171

ఉ. సారసనేత్రి వచ్చుతరి సంభ్రమ మేమన వచ్చు నద్దెసల్
సౌరభవాసనల్ ముసరె సర్వగృహంబులు జంచలత్వముల్
జూరగొనెం దనూరుచులు జొక్కు మెఱర్వఁగ వీక్షణంబులం
గెరచునుండ మించుకొనెఁ గృష్ణునకున్ హృదిమోహముంతటన్. 172

క. ఘనుటకుఁ గొంకుచు నుండెడి
వనజేక్షణ తెరగుఁ జూచి వరలం జూడం
దనరంగను గొంకెడి కృ
ష్ణుని పిధిఁ గని వారిఁ గూర్చి సురుచిరలీలన్. 173

చ. అలివలు సెప్పి రిట్లు వనజాక్షునిగూరిచి కృష్ణతోడ నో
యతులమనోజ్ఞవేషరుచిహాటకమంజులరత్నభూష మా
సతికి సిగాట్ల కోప దిది చాలనెఱింగియు నడ్వమీటగా
మితిగొని విచ్చు గుబ్బచనుమిట్టలు మీవి సుమీ రయంబునన్. 174

క. మీర తెలుంగవలయు శృం
గారవిధా లన్నియును మఁ గౌతుక మెసఁగన్
సారసముఖి పతివిడియము
గారవమున నియ్యఁగాను గైకొనరాదే 175

క. చిగురాకుదొరను గలిచెడి
మగఁడు నినుంగూడఁ గలుగు మన్నన దొరుకం
దగపలుకు నట్టి దేదీ
మగువా నీపాలఁ గలఁడు మన్మథుఁ డింకన్. 176

వ. అనుచును గప్పూరంపు విడె మంబుజలోచనచేతి కిచ్చియుం
గనుఁగొని భామలెల్ల శయనంబును జేరిచి కోర్కెఁ దీర్చు కొం
డని చెలి హస్తమంతఁ దనహస్తమునందునఁ జేర్చఁ బ్రేముడిం
గొని చెలులాడు వాక్యములఁ గూరిమి మెచ్చుకొను న్మనంబునన్.

ఉ. కూడఁగ మంచిలగ్నమునకుం గడె లారయ నెన్న యయ్యెనో
చూడఁగఁ బోయి వత్తు నని సుందరి యొక్కతె పోయె నద్దియే

జాడను బోయెనో యరసి చయ్యన వత్తు నటంచు నోర్తువేఁ
జేడియ లిట్లు బో సతికి సిగ్గరిగాఁ సగ మప్డు వారితోన్. 178

శా. ఆవేళం దలిరాకుబాకుదొర ప్రత్యాలీఢపాదస్థుఁడై
చేవ ల్మీరెడి పచ్చవింటి నరయం జెన్నొందు భృంగావళీ
జ్యావల్లిం దగఁ బూన్చి చెంగలువ నేజం బట్టి చేఁ బూని తా
బూవుం దూపులు గప్పె నిర్వ్యరపయిం బుంఖానుపుంఖంబుగన్.

గీ. పతియుఁ జెలి చేయిఁ బట్టిన పట్టువిడక
వామకరమును బట్టియుఁ బాన్పుఁ జేర్చి
సెజ్జయందునఁ గూర్చుండఁ జేసి యపుడు
దొడయుఁ దొడయుఁ దాకఁగ సిగ్గు కడకుఁ బోవ. 180

సీ. కొనగోట వేనలి కొమ రొప్ప నిమిరినఁ
దళుకైన ముద్దుచెక్కులి సెమర్చెఁ
దళుకైన ముద్దుచెక్కులిగీటినంతనే
పొగరుగుబ్బచనులఁ బులక లెసఁగెఁ
బొగరుగుబ్బచనులఁ బొదివిన యంతనే
తన నీవి బంధంబు దనర వీడెఁ
దన నీవిబంధంబు దనరముట్టిన యంతఁ
దను వెల్ల వేపథు దళము కొనియెఁ

గీ. దావు లలరెడి చక్కెర మోవిఁ గ్రోలి
సరసరతికేళిఁ దేలుచు సరగ నేమి
యేమి గుర్తుల వేసెనో యేమిగనెనో
తెరవ యెఱుఁగదు సౌఖ్యాబ్ధిఁ దేలి యపుడు. 181

క. గాఢోపగూహనంబున
రూఢిగ ఘర్మాంబుభరమును ద్రపాభృత్ మా
లీఢాకటాక్షుణ మగు న
వోఢారత మప్పు డతని కొసఁగెను సుఖముల్. 182

సీ. అభిరామనూత్నకిసారామకుంజవా
టికల శుకముల నాడించి కొనుచు
నబ్జాలయోదరప్రాప్తి వృద్ధిని బొందు
హంసలగతులఁ దామరసికొనుచు
నమలసింధుద్వీప మందు నరుణబంధు
విహంగవిహారము ల్వేడుచు వడి
నమరశైవలినీవిహారములను జక్ర
గణముల నెల్లను గాంచికొనుచు

గీ. రతియుఁ జేతోభవుండు భారతియు నలువ
యుదధిజాతయు శంబరజోదరుండు
శచియు శతమన్యులీలల సకలకాల
ముల నుచితకేళి సల్పిరి చెలియుఁ బతియు. 183

సీ. వానలు క్రమముగా వర్షించె సస్యముల్
వృద్ధిచేతను బిజ్జువీగి పండె
నాయుర్విభూతికప్రాప్తి బొందిరి జను
లగ్నితస్కరభయవ్యాధు లడఁగెఁ.
బాదపకుసుమఫలప్రతతు లెల్లను లస
త్పరిమళాదులతోడఁ బరిఢవిల్లెఁ

గానరుగ్రహితు లై ఘనసుఖాన్వితు లై
బ్రతికిరి నూరేండ్లు పంచజనులు

గీ. నీత్యుపద్రవంబులులేక పృథ్వియందుఁ
గనఁ బ్రజావృద్ధి యొప్పఁగ గాఢమయ్యె
న్యాయపథమున శ్రీకృష్ణుఁ డాదరమున
సంపదల నిచ్చి పాలించు సమయమందు. 184

క. అని యిట్లు రోమహర్షణి
తనరఁగఁ గృష్ణుని కథాసుధారస మఖిలం
బును దెలుప మహాకౌతుకం
బునఁ జెలఁగిరి శౌనకాదిమునికులచంద్రుల్. 185

క. ఈకథఁ జదివిన వినినను
లోకంబున వారియు సుజనలోకంబులకున్
శ్రీకృష్ణుఁడు సంపద లిడి
నాకనివాసులను జేయు నయముగఁ దుదకున్. 186

శా. స్వర్ధేనుప్రముఖాధిపాత్రమలసద్వాణీశరోద్యత్సుధా
వార్ధిప్రాంబుజవైరినిర్మలినదుర్వర్ణోజ్వలజ్జ్యోధర
స్ఫూర్తిస్ఫీరయశోధురంధర సుధీసంఘాతకీరావళీ
వర్ధిష్ణుత్రిదశద్రుమా విహితసంవారాబ్జఖద్యోతనా 187

క. ఖలార్యభయంకరాహిత
హల్యామ్యంజులచకోరికాంబుజనైశ్రీ
కళ్యాణాకరరుచిమాం
గళ్యగుణా నాగభూషణా ఘనసుఘృణా 188

లయగ్రాహి.

మిత్రగణతోషణయమిత్రగణభీషణవిచిత్రగణభాషణచరిత్రరుచిహీరా
మాత్రశుభలక్షణసుసత్రభవకంకణపవిత్రగుణభూషణసుగోత్రసమధీరా
చైత్రనిభలక్షణకగోత్రసమధారణసుసూత్రధరదక్షిణయకృత్రిమవిహారా
చిత్రరుచివేషణసుపాత్రనరరక్షణసుమిత్రరుచిధర్షణ సుపాత్రనిధివారా.

గద్యము.

ఇది శ్రీమద్రామచంద్ర పాదారవింద వందన జగత్త్రాణ సందనప్రసా
దాసాదిత కవితానిర్వాహక ధూళిపాళ సూర్యనారాయణ
తనూభవ సకల సుకవిజనవిధేయ వేంకటరామ నామధే
య విరచితంబైన కాళిందీపరిణయంబను మహా
ప్రబంధంబునందు సర్వంబును
దృతీయాశ్వాసము.
సంపూర్ణము.

